# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 19
స్థాపితం : 1930
సంపుటి 57 సంచిక 43
24-10-1986
శుక్రవారం
12 పేజీలు రూపాయి


# గుట్టుగా బెట్టుగా భారీమంత్రి అయ్యాడు వెంగళరావు!

సోమవారం హైదరాబాదులో అంజయ్య అంత్యక్రియలు; బుధవారం ఢిల్లీలో శ్రీ జలగం వెంగళరావు భారీపరిశ్రమల మంత్రిగా ప్రమాణస్వీకారం- రాజకీయాలలో పరిణామాలు ఎంత వేగంగా, విచిత్రంగా జరిగిపోతాయో తెలియజేస్తాయి. మొత్తానికి వెంగళరావుగారు బెట్టుగా, గుట్టుగా భారీ మంత్రి అయ్యారు! అదృష్టంవుంటే కాలం అట్లా కలిసివస్తుంది. ఆయనకు మా హార్దికాభినందనలు.

ప్రధాని రాజీవ్‌గాంధీ పాతమంత్రులలో ఐదుగురిని తీసివేసి, కొత్తగా ఏడుగురిని చేర్చుకున్నారు. ఈ ఏడుగురిలో ముగ్గురు క్యాబినెట్ స్థాయి కలిగిన మాజీముఖ్యమంత్రులు, తక్కిన ఇద్దరూ అర్జునసింగ్; భజనలాల్. కూడికలు తీసివేతలతర్వాత కేంద్రంలో మూడంతస్తుల మంత్రిమండలి సంఖ్య 58.



## ఇక పిసిసి రోశయ్యకేనా?

వెంగళరావుగారి మంత్రిత్వానికి ముందు మా హైదరాబాదు విలేఖరి వ్రాసిన కథనాన్ని దిగువ చదవండి-

అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావు. రాజ్యసభ సభ్యులు శ్రీ టి. చంద్రశేఖర రెడ్డి, ఇద్దరు సాంబశివరావులు- శ్రీ రావి

మందిని శత్రువులుగా చేసిందనుకోండి. అది వేరే విషయం - పోతే శ్రీ కావూరి సాంబశివరావు ప్రధానంగా కాంగ్రెస్(ఐ)

ఉపాధ్యక్షుడు శ్రీ అర్జునసింగును నమ్ముకున్నారు. వ్యాపారంలో లాగే రాజకీయాలలోకూడా ఆయన న్నే గాడ్ ఫాదర్‌గా చూసుకుంటున్నారు అయితే అటు శివశంకర్, ఇటు పి. వి. నరసింహరావు లతో ఆయన సంబంధాలు పెద్దగా లేవు శ్రీ అర్జునసింగ్ హైదరాబాదులో అంజయ్య అంత్యక్రియలకు హాజరు కావడానికి వచ్చారు. అంత్యక్రియల అనంతరం ఆయన అంతర్ధానంఅయ్యారు. ప్రధాని రాజకీయ సలహాదారు శ్రీ ఎం. ఎల్. ఫోతేదారు, ఎ. ఐ. సి. సి. ప్రధాన కార్యదర్శి శ్రీ కరుణయ్య మూపనార్ తదితర ఢిల్లీ ముఖ్యులు రాజభవన్‌లో అతిథులుగా వుండగా, శ్రీ అర్జునసింగ్ మాత్రం అంబర్‌పేట శ్మశానవాటికనుంచి నేరుగా మారుతికారులో శ్రీ సాంబశివరావుతో కలిసి ఆయన కొత్తగా నిర్మించు కున్న "అధునిక ప్రాసాదానికి" వెళ్లారు. అక్కడనుంచి ఆయన నేరుగా బేగంపేట విమానాశ్రయానికి వెళ్ళిపోయారు శ్రీ సాంబశివరావుకు ఆయనతో వున్న సంబంధబాంధవ్యాలు అలాంటివి.

శ్రీ వెంగళరావుకు కేంద్రమంత్రి పదవి ఇవ్వకుండా పి. సి. సి. అధ్యక్ష పదవి నుంచి తప్పించే అవకాశాలు తక్కువ. రాష్ట్రంలో కాంగ్రెసు పెద్ద... హనంగా ఉన్నారు శ్రీ వెంగళరావుకు, వీరికి నిత్య సంబంధాలు లేవు. రాష్ట్ర కాంగ్రెసు కురువృద్ధులలో ఒకరైన శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి ఒరిస్సా గవర్నరు పదవి ఇస్తామన్నారు కాని అంకా అది కార్యరూపంలోకి రాలేదు. రానున్న పంచాయతీ ఎన్నికలలో ఆయన సేవలను వినియోగించుకోవాలన్న ఉద్దేశ్యంతో ఆలస్యం చేస్తున్నారేమో తెలియదు శ్రీ వెంగళరావుకు కేంద్రమంత్రి పదవి ఇవ్వ

—కొరవ 7వ పేజీలో

**మా హైదరాబాదు విలేఖరి**

మామూలుగా అయితే శ్రీ అంజయ్య మరణం ప్రస్తుత రాష్ట్ర రాజకీయాలలో పెద్దగా ప్రాముఖ్యం వహించకపోవచ్చు. కాని అధిష్టానవర్గం దృష్టిలో ఆయనకు వున్న ప్రాముఖ్యం కారణంగా, పి సి సి అధ్యక్ష పదవి, కేంద్రమంత్రిపదవి- రెండూ ఆయనతో ముడిపెట్టడంవల్ల- ఆ రెండు పదవులను ఆశిస్తున్న ఇతరుల ఆశలు, అవకాశాలు పెరిగాయి. కేంద్రమంత్రి పదవి విషయంలో పి. సి. సి.

పాటి. శ్రీ కావూరి గట్టి పోటీదారులు. వెంగళరావు మిగతా వారికి సీనియారిటీ విషయంలో లేదా ప్రయత్నాల విషయంలో పొందిక లేకపోయినప్పటికి ఢిల్లీలో ఇప్పుడు నిర్ణయాలు జరుగుతున్న తీరువల్ల ఎవరు ఈ పందెంలో నెగ్గినా ఆశ్చర్యంలేదు. శ్రీ వెంగళరావు చిల్లర దేవుళ్ళను పట్టించుకోకుండా మూల విరాట్టు అయిన శ్రీ రాజీవ్‌గాంధీపైనే నేరుగా ఆధారపడ్డారు ఆ వైఖరి చాల

అంజయ్య - నెల్లూరు

# గుండెగలిగిన ముఖ్యమంత్రి అంజయ్య!

అంజయ్య అధ్యాయం శాశ్వతంగా పరిసమాప్తమైంది. 57 ఏళ్ళకే ఆయన నూరేళ్ళు నిండాయి. ఒక్కొకరు దీర్ఘకాలం ఎందుకు వుంచబడుతారో, ఒక్కొకరు మధ్యలోనే ఎందుకు ముగింపబడతారో ఆ సృష్టి రహస్యం మనకు తెలియదు. ఏమైనా అంజయ్య అప్పుడే పోవలసినవాడు కాదు; అందువల్లనే ఆయన చనిపోయాడంటే ఆయనను చూడనివాళ్ళకుకూడా అయ్యో అనిపించింది!

అంజయ్య 1980 అక్టోబర్‌లో ముఖ్యమంత్రి అయ్యారు; 1982 ఫిబ్రవరిలో నిష్క్రమించారు. ఈ పదహారు మాసాల కాలంలో ఆయన నెల్లూరుకు ఒకేఒకసారి వచ్చారు; అందరిచేత 'బ్రహ్మ' రథం పట్టించుకొని పోయారు. అది శాపమో సాంప్రదాయమో తెలియదుకాని ఇటీవలి సంవత్సరాలలో నెల్లూరును సందర్శించిన ఏ ముఖ్యమంత్రికూడా తర్వాత ఎక్కువకాలం పదవిలో వుండలేకపోతున్నారు. ఆ పరిణామం నెల్లూరుకు కళంకమే! అంజయ్యగారు 1981 సెప్టెంబరులోనో, అక్టోబరులోనో నెల్లూరు ప్రోగ్రాం నిర్ణయించుకొని వాయిదావేసుకున్నారు. అప్పుడు 17-11-81 సంచిక 'జమీన్‌రైతు'లో "ముఖ్యమంత్రి నెల్లూరుకువస్తే పదవి పూడిపోతుందా? అంజయ్య కార్యక్రమం వాయిదాకు అదే కారణమా!" అని వ్యాఖ్యానించబడింది.

అంజయ్యగారు ఎట్టకేలకు 1982 జనవరి 16 తేది నెల్లూరు వచ్చారు; అది ఒక్కరోజు పర్యటనే; అదికూడా మద్రాసునుండి రోడ్డు మార్గాన వచ్చారుకాబట్టి అక్కడక్కడ చేరిన జనంతో మాట్లాడటంతప్పితే, ఆయన కార్యక్రమం ఒక్క నెల్లూరుకే పరిమితమైంది. పెన్నా ఆనకట్ట నూరేళ్ళ పండుగని కో ఆపరేటివ్ బ్యాంకి ఆవరణంలో పెద్దసభ ఏర్పాటుచేశారు. ఆ సభలో



(అంజయ్య సంతకం ఇది)

స్థానిక వక్తలు అడిగినదానికి ఆయన కాదనికాని, లేదనికాని అనలేదు; అన్నిటికి "తప్పకుండా" చేస్తానన్నారు అంజయ్య. ఆ వుపన్యాసంలోనే నెల్లూరుకు వచ్చిన ముఖ్యమంత్రి దిగిపోతాడన్న "జమీన్‌రైతు" వ్యాఖ్యను ప్రస్తావించి "జమీన్‌రైతు"కు (జమీన్ రైతు అనేమాట ఆయనకు సరిగారాలేదు; ఏదో జమీందారు రైతంట అన్నారు) కలల్లో దేవుడు కనబడుతాడో, దెయ్యాలు కనబడతారో తెలియదుకాని ప్రతివారం అంజయ్య దిగిపోతాడు దిగిపోతాడు అని వ్రాస్తుంటాడు" (18-1-82 సంచిక) అని విమర్శించారు; అది విపర్యమయినా నవ్వులు పుట్టించేదిగానే వుంది! అదేమి దురదృష్టమో, ఆయన ఈ మాటలన్న నెలరోజులకే పదవి పోయింది!

అంజయ్యగారు చదువుకున్నవారు కాదు; ఉర్దూలోతప్ప ఇంగ్లీషులో, తెలుగులో సంతకం పెట్టేవారుకాదు; పెట్టలేకనో ఏమో? ఈవ్యాసంలోనే ప్రకటింపబడిన సంతకం ఆయనదే; ఆయన ముఖ్యమంత్రిగా వుండగా వచ్చిన ఒకజాబు నుండి చేయించబడిన బ్లాకు అది. అది ఏభాషో మొదట తెలియలేదు; తర్వాత తెలిసింది అది ఉర్దూ అని! అప్పుడు ఏదైనా సందర్భంలో వుపయోగిద్దామని చేయించిన బ్లాకు; దాన్ని ఆయన నిర్యాణానంతరం వుపయోగించవలసి వస్తున్నది. అంజయ్యగారు అవిద్యావంతులైనా, నిరుపేదతనంనుండి వచ్చినా, ఆయనలో అపారమైన ఆత్మవిశ్వాసము, ఆత్మస్థైర్యము, వ్యక్తిత్వము వుండేవని మనజిల్లాకు సంబంధించి ముఖ్యమంత్రిగా ఆయన తీసుకున్న నిర్ణయాలు సమీక్షిస్తే తెలుస్తుంది.

1978 ఎన్నికల తర్వాత మొదటి ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఆయన యమునికి శివునికి వెరవేవ్యక్తి కాదని పేరు. అటువంటి చెన్నారెడ్డి తన చిర

—కొరవ 8వ పేజీలో

## పినాకినీ తీరం

పాతసంగతి-

ఒక జ్ఞాపకం

అంజయ్య మరణించారంటే నాకొక పాతసంగతి జ్ఞాపకానికొస్తున్నది. ఆ జ్ఞాపకం ముఖ్యం కాదుగాని, దానికి సంబంధించి ఒక వివరణ ఇవ్వడం నా ఉద్దేశ్యం. అసందర్భము; అనవసరము కాదనుకుంటే దాన్ని గూర్చి రెండు మాటలు-

అంజయ్య ముఖ్యమంత్రి అయినప్పుడు జనార్ధనరెడ్డి కాకుండా జిల్లాలో నలుగురు మంత్రిత్వాన్ని ఆశించారు. ఆనం సంజీవరెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, పెళ్ళకూరు రామచంద్రారెడ్డి, గిద్దలూరు సుందరరామయ్య- వీరు ఆ నల్గురు. నా జ్ఞాపకం వీళ్ళందరూ జిల్లాకు రెండవ మంత్రిత్వం వస్తుందని, అది తమకివ్వమని కోరుకున్నవారనుకుంటాను. అంటే జనార్ధనరెడ్డి మంత్రిత్వం ఖాయమని అనాటికి అందరి దృఢాభిప్రాయమన్నమాట. వీరిలో ఎవరెవరు ఎవరెవరిద్వారా తమ ప్రయత్నాలు సాగించుకున్నారో ఏమోకాని, సుందరరామయ్యకు సంబంధించి మాత్రం ఆర్గురు లెజిస్లేటర్లు ఆయనకు మంత్రిత్వం ఇవ్వవలసిందిగా సంతకాలు చేసిన ఒక నివేదికను అంజయ్యగారికి సమర్పించారు.

ఆ సమయంలో సెక్రటేరియట్‌లోని ముఖ్యమంత్రిగారిగది కిటకిటలాడుతున్నది. అంత జనసందోహంలోకూడా ఈఆర్గురు ఇచ్చిన నివేదికపట్ల అంజయ్యగారు ప్రత్యేక ఆసక్తి చూపించారు; దాన్ని భద్రంగా డ్రాయర్లోపెట్టుకొని, వివరంగా మాట్లాడాలి, తర్వాత కలసుకోండి అన్నారు. తర్వాత సంతకం చేసిన అందరూకలసి ఆయన్ను కలుసుకున్నట్టు లేదు అపిమ్మట ఏమైందికూడా నాకుతెలియదు అంజయ్యగారు సుందరరామయ్య అభ్యర్థిత్వానికి సుముఖత చూపించాడని పోయినవారు అనుకున్నారు.

కాని తర్వాత నాకనిపించింది అంజయ్యగారి సుముఖత సుందరరామయ్య మంత్రిత్వంవల్ల కాదో జనార్ధనరెడ్డిని తప్పించినపుడు, మంత్రిత్వంకివ్వతగిన బలమైన వ్యక్తి ఎవరా అనేది ఆయన అన్వేషణేమో ననిపించింది. నాదింకొక అనుమానం కూడా- సుందరరామయ్య మంత్రిత్వానికి సంతకంపెట్టి ఆయనతోటి అంజయ్య వద్దకు తిరిగినవారిలో ఎవరైనా లోలోపల ఆయనకు వ్యతిరేకంగా, ముందు పురమాయించిన ముగ్గురిలో ఎవరికైనా ఇమ్మని చెప్పారా అనికూడా నా అనుమానం,

అది పోనివ్వండి- ఇక్కడ వివరించదలచింది అదికాదు. సుందరరామయ్యకు మంత్రిత్వం ఇవ్వమని కోరినవారు జిల్లాకు రెండవమంత్రిత్వం ఇచ్చేట్టుంటే, అది ఒక నాగిరెడ్డికి ఇవ్వదలచుకుంటే సుందరరామయ్య విషయం ఆలోచించమని కోరారుగాని; జనార్ధనరెడ్డికి ముగించి సుందరరామయ్యకివ్వమని కోరలేదు. కాని ఈ విషయంలో జనార్ధనరెడ్డి ఆ సమయంలో దురభిప్రాయ పడినట్టున్నాడు; సుందరరామయ్యకుమంత్రిత్వం ఇవ్వమని కోరినవారు తనకు ద్రోహం చేశారనే అభిప్రాయం ఆయనకు కల్గినట్టుంది. అది ఆయనకు స్వంతంగా కలిగిన అభిప్రాయమో, లేక ఇతర అనేక విషయాలకు సంబంధించి ఇతరులచేత కల్పించబడుతుండినట్టు ఏర్పడిన అభిప్రాయమో తెలియదుగాని, అది పొరపాటని మాత్రం చెప్పక తప్పదు.

తర్వాత సుందరరామయ్యమంత్రిత్వానికి సంతకంపెట్టినవారిలో ఎవరైనా రాజకీయం చేశారో ఏమో, శ్రీనివాసులురెడ్డికి మంత్రిత్వంరావడాన్నిబట్టి అనుమానించ తగివుంది.జనార్ధనరెడ్డిమంత్రిత్వం అనివార్యమైనదైనపుడు, రెండవమంత్రిత్వం సహజంగా సీనియర్లయిన సంజీవరెడ్డి, పెళ్ళకూరులలోఎవరికైనావచ్చివుండాలి

—కొరవ 8వ పేజీలో

●● శ్రద్ధాంజలి

## శ్రీమతి గాలి ధనలక్ష్మి

1982వ సంవత్సరం అక్టోబరు 8వ తేది మమ్ములనందరినీ దుఃఖసాగరమున ముంచి దివంగతురాలై 23-10-86 తేదికి నాలుగు సంవత్సరాలు నిండినవి. చతుర్థ వర్ధంతి సందర్భంలో శ్రద్ధాంజలి ఘటిస్తూ-

గాలి వెంకటప్పనాయుడు (భర్త)
వేలమూరు రామకృష్ణప్రసాద్ (తమ్ముడు)
Lecturer - (NBKR-IST.)
వేలమూరు జ్ఞానప్రసూనాంబ (కుమార్తె)
గాలి వెంగమాంబ (కుమార్తె)

గాలి రవిశంకర్ (కుమారుడు)
గాలి రవీంద్ర (కుమారుడు)
గాలి నారాయణస్వామినాయుడు (మరిది)
గాలి మాధవయ్యనాయుడు (మరిది)

మరియు

**HOTEL R R R** Near Uma Talkies, Gandhi Square, Mysore .

యాజమాన్యం మరియు సిబ్బంది,

**HOTEL R R R** Annexe, Gandhi Square, Mysore.

# జమీన్‌రైతు

## అంజయ్య

మాజీ ముఖ్యమంత్రి, అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ టంగుటూరు అంజయ్య జీవితం అర్ధాంతరంగా ముగిసింది: ఆయన మనకిక లేరు. ఆయన కనపడరు, ఆయన చలోక్తులు హాస్యోక్తులు ఇక వినబడవు. ఆంధ్రప్రదేశ్ జనప్రియుడైన ఒక నాయకుణ్ణి, కాంగ్రెస్‌పార్టీ క్రమశిక్షణగల ఒక సైనికుణ్ణి కోల్పోయాయి.

అంజయ్య చదువుకోలేదు, పూటగడవని నిరుపేద కుటుంబీకుడు; అరణాల కూలివాడుగా జీవితం ప్రారంభించాడు, ఆరు కోట్ల ప్రజల పాలకుడు కావడమేకాదు, భారత ప్రభుత్వ కార్మిక శాఖకే అధిపత్యం వహించాడు కీ॥ శే॥ వి. వి. గిరి, గుల్జారిలాల్ నందా, కనూబాయ్ దేశాయ్ వంటి వున్నతస్థానాలకు వచ్చినవారు కూడా కార్మిక నాయకులుగా ప్రఖ్యాతి గాంచినవారే; కాని వారు కార్మికుల శ్రేయస్సుకోసం పనిచేసినవారేగాని, కార్మికులుగా జీవితానుభవం కలిగినవారుకాదు; కార్మికులలో కార్మికులుగా పనిచేసినవారుకాదు. అంజయ్యగారి కార్మిక నాయకత్వం అటువంటిది కాదు; దారిద్ర్యపు కాపాన్ని, ఆకలిబాధను, కూలివాని కష్టాలను అనుభవించిన జీవితం ఆయనది. అందువల్లనే ఆయన కార్మికనాయకత్వం అసలుసిసలైనది, కార్మికులకు అత్యంత ఆప్తమైనది, హితకరమైనది. ఆయన మరణానికి కోట్లాది కార్మికులు కంటనీరు పెట్టుకోవడమే అందుకు నిదర్శనం.

అంజయ్యకు ఇంగ్లీషుచదువులు లేకపోవచ్చుగాని లోకజ్ఞానంలో, రాజకీయ దురంధరత్వంలో విశారదుడాయన, సునిశితమైన మేధస్సు, సేవాత్యాగాలు, భక్తివిశ్వాసాలు, నెమ్మది నిలకడలు ఆయన ప్రాభవానికి, సమున్నతస్థితికి సోపానాలైనాయి. ఎంత పైపదవికిపోయినా తన గతజీవితాన్ని మరచిపోకపోవడం, తన సంఘాన్ని విస్మరించకపోవడం, నమ్రత నిరాడంబరతలను విడనాడకపోవడం, మనసువిప్పి మాట్లాడడం ఆయనను సామాన్యప్రజలకు సన్నిహితం చేశాయి, ప్రజలమనిషిని చేశాయి,

ముఖ్యమంత్రిగా అరవైఒక్కమందికి మంత్రిత్వాలిచ్చి 'జంబో' మంత్రివర్గంగా ఎగతాళిపాలు కావడం, వ్యక్తిగత మొగమోటంతో అడగనివాడు పాపాత్ముడన్నట్లు పదవులు పంపకంచేయడం మినహాయిస్తే; దృఢమైన నిర్ణయాలు తీసుకోవడంలో, వాటిని ఖచ్చితంగా అమలుపరచడంలో సమర్థుడైన పాలకుడుగానే పేరుతెచ్చుకున్నాడు. ధైర్యంలేక ఎందరో ముఖ్యమంత్రులు వాటవేసిన పంచాయతీరాజ్ ఎన్నికలను పార్టీరహితంగా నిర్వహించడం అంజయ్య ముఖ్యమంత్రిత్వంలో మరచిపోలేని విషయం. ఎన్నో అకాడమీలను ప్రారంభించి సంగీత నృత్య లలితకళా విభవానికి ప్రోత్సాహమిచ్చిన ముఖ్యమంత్రిగాకూడా అంజయ్యపేరు శాశ్వతంగా నిల్చిపోతుంది

కేంద్ర కార్మిక మంత్రిగా కార్మికుల శ్రేయస్సుకు ఎన్నో శాసనాలు చేయగలిగాడు అంజయ్య. వర్కింగ్ జర్నలిస్టులు సైతం ఆయన్ను తమ శ్రేయోభిలాషిగా, తమకెంతో లాభం చేకూర్చిన వ్యక్తిగా శ్రద్ధాంజలి ఘటించారంటే, శ్రామికజన హృదయాలను ఆయన ఎంతగా చూరగొన్నారో విదితమవుతుంది.

అంజయ్య తన వున్నతిద్వారా కార్మికలోకానికి, సామాన్య ప్రజలకు గర్వకారకుడైనట్లే, సర్వపౌరులకు సమానహక్కులు ప్రసాదించిన భారత రాజ్యాంగానికి మాన్యతను గూర్చాడు. పేదరికం, నిరక్షరాస్యతలు పైకిరావడానికి ప్రతిబంధకంకాదని రుజువుచేస్తుంది అంజయ్య జీవితం. అసువులుబాసిన ఆ ధన్యజీవికివే మా జోహారులు!



## జమీన్‌రైతు 50 ఏళ్ల క్రితం ఈవారం

23-10-1936

**జవహర్‌లాల్‌గారికి తిక్కవరపు రామిరెడ్డిగారి విందు**

తిక్కవరపు రామిరెడ్డిగారు ఆ [illegible] వలను తమ స్వగృహమున శాహ్వా[illegible]నించి యుపాహారముల సత్కరించిరి. శ్రీ రేబాల లక్ష్మీనరసింహారెడ్డిగారు (మునిసిపల్ ఛైర్మెన్) శ్రీ చంద్రశేఖర రెడ్డిగారు, శ్రీ విశ్వనాథరావుగారు, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు, శ్రీ [illegible] మూర్తిగారు శ్రీ [illegible] [illegible] సుబ్రహ్మణ్యంగార్లు విందులో పాల్గొన్న ప్రముఖులు [illegible] వారు నెల్లూరు పురపాలక సంఘం వారి సన్మానపత్రము అందుకొనిరి.

**పురపాలకసంఘ సన్మానము**

నెల్లూరు పురపాలక సంఘంవారు తమ సంఘ భవనమునందు సా॥ 6 గంటలకు సన్మానపత్రమొసంగిరి. పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ రేబాల లక్ష్మీనరసింహారెడ్డిగారు సన్మానపత్రమును చదివి [illegible] పేటికయందుంచి రు 116 లు నెహ్రూగారికి సమర్పించిరి. నెహ్రూగారు సన్మానపత్రమునకు ప్రత్యుత్తరమొసంగుచు పురపాలక సంఘముల బాధ్యతలు కర్తవ్యములను గురించి ముచ్చటించిరి. పురపాలక సంఘముల నిర్వహణమందు తమకు కూడా అత్యంతమగు ఆసక్తి కలదని నుడివిరి. కాని ఈ సంఘము లొకవేళ [illegible] సామాన్య కర్తవ్యములందుగాక పురపాలకసంస్థలన్నిటియొక్క పరమోద్దేశమైన ప్రధానకార్యములందే తమకుగా [illegible] కలదనిరి.

# జన్నవాడలో శంకర మఠమా?

జొన్నవాడలో శంకరాచార్యుల వారి పేరుతో పెద్దమోసం జరుగుతున్నట్లుంది. శ్రీ కంచి కామకోటి పీఠం (జగద్ శ్రీ శంకరాచార్య స్వామి మఠ్ శాఖ) అని బోర్డు తగిలించి వున్నారు. అక్కడ పూజలు, గీజలేవీ జరపడంలేదు పైగా ఆ ఇంట్లోనే కాపురం చేస్తున్నారు. పవిత్రమైన మఠం పేరు ఇట్లా దుర్వినియోగం కావటం క్షమార్హం కాదు సంబంధితులు వెంటనే వీరిపై చర్య తీసుకోవడం అవసరం.

గుంటూరు ...పచ్చల కోటేశ్వరరావు

ఉపాధ్యక్షులు, రాష్ట్ర హిందూ దేవాదాయ ధర్మాదాయ ధర్మకర్తల మండలి.

**వెలగని వీధి లైట్లు**

గూడూరు టౌన్లో వీధిలైట్లు సక్రమంగా వెలగడమేలేదు. అధికార్లకు ఎన్నిసార్లు చెప్పినా కదలికే వుండటంలేదు. రాత్రిపూట కటికచీకటి గాఢాంధకారం మెయిన్‌రోడ్డు వరకే సంగతి గొందుల్లో ఆడవాళ్ళు ఒంటరిగా నడవడానికి భయపడుతున్నారు

ఇదిట్లావుంటే బాగూర్ వీధిలో నీళ్ళ పాములది పెద్ద సమస్యగా వుంది. వెంకటేశ్వరస్వామి గుడి కోనేరు పెద్ద మురికికూపం కావడంతో అవి అక్కడ ఆశ్రయం పొంది రాత్రిపూట నగర సంచారానికి

**జనవాణి**

వస్తున్నాయి చీకట్లో కాళ్ళకు చుట్టుకుంటున్నాయి. జనం హడలి చస్తున్నారు

గూడూరు ...ఎల్. వి. సుబ్బయ్య

## మేము-మీరు

### సమీక్ష, విమర్శలు సమంజసంగాలేవు!

పదహారేళ్ళ అమ్మాయిపై శ్రీ సి. నారాయణరావు చేసిన సమీక్ష (క్టోబరు 10) సమంజసంగాలేదు, సూపర్ డైరెక్టర్లనబడే కోదండరామిరెడ్డి, రాఘవేంద్రరావు వంటివారే మూస చిత్రాలను తీస్తున్న ఈ రోజుల్లో, ఈ పోటీ వాతావరణంలో కొంతైనా నవ్యతతో చిన్న తారలతో చిత్రం తీయటం ఒక విశేషం. చిన్నబడ్జెట్ చిత్రాలను గొంతుపిసికి చంపుతున్న స్టార్‌సిస్టంలో, ఇటువంటి చిత్రాలు రావడం ఒక సాహసమే అనుకోవాలి

అటువంటి చిత్రాన్ని నారాయణరావుగారు అపహాస్యంగా వుందని సమీక్షించారు నిజానికి పదహారేళ్ళ అమ్మాయి కథ ఆహ్లాదకరంగా సాగిపోతుంది; పైగా ఏమాత్రం అశ్లీలత, హింసలులేవు. నిస్సంకోచంగా కుటుంబమంతా కలిసి చూడగల్గిన చిత్రం ఇది. ఇందులో అసహజ సన్నివేశాలున్నాయన్నారాయన- అయితే అసహజత్వం లేకుండా కామెడీ ఎట్లా పండుతుంది చెప్పండి?

నారాయణరావుగారే రేపటిపౌరులు సమీక్షలో, పోలీసు ఆఫీసర్, లాయర్, డాక్టర్లు సమాజ పతనానికి మూలకారణాలని చూపడం కొత్తదనంగావుందన్నారు- కానీ అదెంత పాతవిషయమో టి కృష్ణ చిత్రాలు ఏవిచూసినా తెలుస్తుంది అలనే ఆదేసినిమాలో ఐఫూర్ కంటే హీనంగా మంత్రిపాత్రను మలిస్తే ఆయన కట్టిందుకోలేదు శ్రావణమేఘాలులో ఇద్దరు ఆడవాళ్ళు ఒక మగవాణ్ని ప్రేమించడం, అందులో త్యాగం కొత్తప్రయోగమన్నారు, కానీ ఈ ట్రయాంగిల్ ప్రేమ కథ బ్రహ్మ పాతది

సమీక్షకులు కొత్త చిత్రాలను, చిన్న చిత్రాలను ప్రోత్సహిస్తే మంచిది.

మద్రాసు ...పి జనార్దనరెడ్డి

# ఏ. సి. మనిషి గంభీరం- మనసు విశాలం!

ఖాళీలకేక రెడ్డి రోజులలోనే మళ్ళీ సహాయ కార్యదర్శిగా చేరాను. అప్పుడు నెల్లూరు జిల్లా వాస్తవ్యులు శ్రీ ఏ. సి. సుబ్బారెడ్డిగారు చిటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖలకు అమాత్యులుగా ఉన్నారు. వారి అంతరంగిక కార్యదర్శి సెలవు మీద వెళ్ళగా ఆ స్థానములో ఖాళీ యేర్పడింది. నేమిడుకూరమూ ఒకే జిల్లావారమైనను శ్రీ సుబ్బారెడ్డిగారితో నాకంతవరకు పరిచయంలేదు. వారిమిత్రులు శ్రీ యల్. బుల్లయ్యగారు (వీరప్పుడు విద్యాశాఖ డైరెక్టరు. తర్వాత ఆంధ్ర విశ్వ విద్యాలయపు ఉపాధ్యక్షులుగా చేశారు. నన్ను గురించి వారికి చెప్పినట్లున్నది. నాతో సంప్రదించకుండగనే మంత్రిగారి అంతరంగిక కార్యదర్శిగా వేస్తూ ఉత్తర్వులు జారీచేశారు. ఈ పదవికి అదనపు జీతం గూడా వుంటుందనీ మా సొంతజిల్లాకు, స్వగ్రామానికి అప్పుడప్పుడూ వెళ్ళే అవకాశం వుంటుందనీ, శ్రీ సుబ్బారెడ్డిగారికి అంతరంగిక కార్యదర్శిగా చార్జి తీసికొన్నాను. ఫైళ్ళలో వారిచిచ్చు నంబహ అను మన్నించి నన్నెంతో ఆదర పూర్వకంగా చూస్తూ వుండేవారు.

> అధికారి
> అనుభవాలు
> • • •
> దరిమడుగు కామయ్య
> (రిటైర్డ్ డిప్యూటీ సెక్రెటరి)

వారు బాహ్యంగా గంభీరంగా కనిపించినా హృదయం మాత్రం మెత్తనిది, విశాలమైనది. నేను వారి అంతరంగిక కార్యదర్శిగా వున్నప్పుడే, వారి సహాయంతో మాగ్రామానికి పంపింగ్‌స్కీమ్ మంజూరు చేయబడింది. మరల ఉపకార్యదర్శి పదవి ఖాళీకాగానే, సాధారణ పరిపాలనా శాఖలో చేరాను. ఉపకార్యదర్శిపదవిలో ఉన్నప్పటికూడా అంతరంగిక కార్యదర్శిగానే వుండటానికి శ్రీ సుబ్బారెడ్డిగారు ప్రయత్నించారు. కాని అప్పటి నిబంధనలు అడ్డురావడంతో ఆప్రయత్నం విరమించుకొన్నారు. 6-12-1961 నుంచి 1-3-1962 వరకు సాధారణ పరిపాలనా డిపార్టుమెంటు (ఎలక్షన్ శాఖ) లోను, 1962 సంగలో హోమ్ డిపార్టుమెంటులో పోలీసు, కార్మిక, రవాణాశాఖలలోను, 1962-63 లో మళ్ళీ సాధారణ పరిపాలనా డిపార్టుమెంటులో, పబ్లిక్ సర్వీసస్, ఆకోమడేషన్ శాఖలలోను ఉపకార్యదర్శిగా పనులు నిర్వహించాను. 1963 సంగన మరల ఆరోగ్య, గృహవసతి, మునిసిపల్ పరిపాలన డిపార్టుమెంటుకు మార్చారు. అప్పుడు మాకు మంత్రి శ్రీ ఆలపాటి వెంకట్రామయ్యగారు,

—కొరవ 8 వ పేజీలో

# కళాప్రియ నృత్యోత్సవాలు

సాంస్కృతికసంస్థ కళాప్రియ మహిళా విభాగం దసరాపండుగ సందర్భంగా కస్తూరిబా కళాక్షేత్రంలో 9,10,11 తేదులలో నృత్యోత్సవాలు నిర్వహించింది.

9 తేది సభకు శ్రీమతి పూండ్ల దేవసేనా శ్రీనివాసులురెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీమతి దుర్గ రాజమ్మ, శ్రీమతి కొత్తపల్లి పద్మ పాల్గొన్నారు. ముఖ్యఅతిధి శ్రీమతి గిరీష్‌కుమార్ జ్యోతి వెలిగించి, సభను ప్రారంభించి, మాట్లాడారు. తర్వాత శ్రీమతి దుర్గ రాజమ్మను ఆమె సన్మానించింది. నృత్య కళాకారిణి శ్రీమతి కొత్తపల్లి పద్మను, శ్రీమతి పి. రాజేశ్వరి సన్మానించారు. తర్వాత శ్రీకృష్ణ పారిజాతం నృత్యనాటిక ప్రదర్శన జరిగింది శ్రీమతి జి. సత్యవతిస్వాగత, వందనాలు చెప్పారు.

10 తేది సభకు శ్రీమతి ప్రయాగ లలితా వెంకటరావు అధ్యక్షత వహించారు. శ్రీమతి నేలనూతల పార్వతమ్మ, శ్రీమతి జి. సత్యవతి, నర్తకి కుమారి ఆలర్‌మేల్‌వల్లి పాల్గొన్నారు. ముఖ్య అతిధి జాయింట్ కలెక్టర్ సతీమణి శ్రీమతి కల్యాణి విశ్వనాథ్ దుర్గాపూజ చేసి, కళాప్రియ మహిళల కృషిని మెచ్చు

> నెల్లూరు
> సంగతులు

కొన్నారు. తర్వాత ఆమె శ్రీమతి నేలనూతల పార్వతమ్మను సన్మానించారు. తమిళనాడు ఆస్థాననర్తకి కుమారి అలర్‌మేల్‌వల్లిని, శ్రీమతి దేవసేన సత్కరించారు. తర్వాత అలర్ మేల్‌వల్లి నృత్య ప్రదర్శన జరిగింది.

11 తేది సభకు శ్రీమతి అరుణా రాజశేఖర్ అధ్యక్షత వహించారు. వి.ఆర్.మహిళా కాలేజి ప్రిన్సిపాల్ శ్రీమతి సి. శారదా

—కొరవ 10 వ పేజీలో

# ఇవి శాశ్వత గృహాలా? బొమ్మరిల్లా?

పెళ్ళిచేసిచూడు, ఇల్లుకట్టి చూడు.. అన్నారు; అబ్బాయి పక్షం వారైతే ఇప్పట్లో పెళ్ళి ఆనందమే. కోరినంత కట్నం ఇవురుకోవచ్చు; అడ్డమైన కోర్కెలన్నీ అడగవచ్చు! కాని, చేతినిండా డబ్బు పుష్కలంగావున్నా ఇల్లుకట్టడం మాత్రం మాటలుకాదు! మరి, ఇల్లు మనం కట్టుకోవడమే ఆలివికానిదని అయినప్పుడు, జనంకోసం వందలు వేల ఇళ్లు కట్టివ్వడం అంటే మాటలా? ఎంతటెంతటి స్థిరసంకల్పం కావాలి? కార్యదక్షత కావాలి? చిత్తశుద్ధి కావాలి? పేదలపట్ల సానుభూతి, వారి అవసరాలపట్ల అవగాహన కావాలి?

వీటిలో ఏవి వున్నా లేకపోయినా, ఒక్కొక్క సందర్భంలో మచ్చుకు ఒక్కటికూడాలేకపోయినా, శాశ్వత గృహనిర్మాణ పథకంమాత్రం జోరుగా జరిగిపోతున్నది. ఏ మంత్రితర్వులో, గవర్నరు దొరలో వస్తుంటే ఇదివరకు పట్టాల పంపకం 'పరామామూలు' కార్యక్రమంగా వుండేది; ఇప్పుడు ఇళ్ళ ప్రవేశోత్సవం ఆ స్థానమలంకరించింది.

నెల్లూరుజిల్లాలో 'ఇంటింటి రామాయణం' కథ మొదలైంది 1981 లో! అంతకు ముందెప్పుడో ఎల్. ఐ. సి. గృహాలతోనే నెల్లూరుజిల్లాలో ఇంటింటి రామాయణం ప్రారంభమైంది కాని, అవ్వాటి ఆనవాళ్ళు లేవు; అందువల్ల ప్రస్తుత కథాకాలం ప్రారంభం 1981 లోనే అనుకోవాలి!



జిల్లాకు గౌరవం తెచ్చిన కలెక్టర్ జన్నత్ హుస్సేన్

మొదట్లో సర్కారువారు గృహనిర్మాణానికి అంచనావేసిన మొత్తం ఎంతో తెలుసా?- అక్షరాలా వెయ్యిరూపాయలు మాత్రమే! అప్పుడే 'సెమీ పర్మనెంట్' పేరుతో మరొక పథకం ప్రారంభించారు. వాటికిచ్చినడబ్బు, ఇంటికి రు 2500లు! ఈ రెండుపథకాలక్రింద అప్పట్లో జిల్లాలో 11,243 ఇళ్లు మంజూరు చేశారు. అందులో వెయ్యిరూపాయలవి 9516 అయితే, రు 2500 ల లెక్కలో 1727; వీటిలో అప్పుడు పూర్తయినవి వెయ్యి రూపాయలవి 5880 అయితే, రెండో రకంలో వందైన అంటే సరిగ్గా వంద ఇళ్ళే!

ఈ ఇళ్ళు పూర్తి కాకపోవడమటుంచి, వెయ్యి రూపాయలు నిజమైన పేదవాడికి చేరేసరికి బాగా చిక్కిపోయి వంద. రెండు వందలుగా మిగిలిన సాదృశ్యాలుకూడా చాలావున్నాయి. ఫలితంగా అప్పుడు కట్టిన ఇళ్ళన్నీ ఒక్కగానివానకే అడ్రసు లేకుండా పోయాయి. కాగితాల్లోమాత్రం ఇన్నివేల మందికి ఇళ్ళు కట్టించి ఇచ్చామని ఘనంగా వ్రాసుకుని అధికారులు సంబరపడ్డారేతప్ప, నిజంగా దానివల్ల పేదవాడికి జరిగిన మేలు శూన్యం.

తమ పథకం ఎంత అపహాస్యం పాలైందో తమకే అర్థమైంది కాబోలు- 82-83 నాటికే ఇళ్ళ అంచనాలను రు 4500 లకు పెంచారు. 82-83 లో ఈ ఇళ్లు 4545 కట్టాలని లక్ష్యం పెట్టుకున్నారు.

అయితే ఈ మంజూరు, ఈ లక్ష్యసాధన ప్రయత్నాలూ, అన్నీ కాగితాలపైనే! 83 సంవత్సరం అంతానికి వెనక్కుతిరిగి చూసుకుంటే, కట్టిన ఇళ్ళు వ్రేళ్ళమీద లెక్కపెట్టటానికికూడా చాలలేదు. వెయ్యిరూపాయల ఇళ్ళయినా,

> పేదలకు శాశ్వత గృహనిర్మాణంలో నెల్లూరుజిల్లా స్టేట్‌ఫస్ట్ అట- కాని ఇవి నిజంగా పేదలకు శాశ్వత నీడ కల్పిస్తాయా?

అటు అధికార్లకు ఇటు పేదవారికికూడా ఖంచేయటానికి సుకరంగా వుండినాయి కాబట్టే ముప్పాతికభాగం వరకు కట్టినట్లు

—కొరవ 8వ పేజీలో

# కావలి ఓవర్ బ్రిడ్జికి ఇన్నాళ్లకు మోక్షం!

* పెదబీ్పపురం నరపశువులు ముగ్గురు పట్టుబడ్డారు
* సచివోత్తముడి సచివుడికి రిజర్వాయర్ నీళ్లన్నీ దత్తం!
* భార్యను చంపి పూడ్చిపెట్టాడట

కావలి టౌన్‌లోని ఉదయగిరిరోడ్డు రైల్వే లెవల్ క్రాసింగ్‌పై ఓవర్ బ్రిడ్జి నిర్మించడానికి రైల్వే అధికారులు సర్వే జరిపారు; ఒప్పందాన్ని కొలతలు తీశారు, 15 లక్షల ఖర్చుతో దీని కట్టడం పూర్తి చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయట. స్థలం దురాక్రమించినవారికి కూడా శ్రీముఖాలు పంపారు.

ఈ ఓవర్‌బ్రిడ్జి కోసం చాలాకాలం నుంచి ఆలస్యం జరుగుతూంది: ఎంతో మంత్రులకు, అధికారులకు, ముఖ్యమంత్రులకు పౌరులు మొరపెట్టుకున్నారు. ఇన్నాళ్ళకైనా దానికి మోక్షం కల్గితే, కావలికి కటకటపడుతున్న వేలాదిమంది పౌరులకు పరిశ్రమ తప్పుతుంది.

## పెదబీ్పపురం హంతకులు దొరికారు

ఆత్మకూరుతాలూకా పెదబీ్పపురంలో ఒక యువతిని పరమ పాశవికంగా చెరిచి, గొంతునులిమి చంపిన నరరూప రాక్షసులు ముగ్గుర్ని ఆత్మకూరు పోలీసులు పట్టుకున్నారు. 17 తేది రాత్రి, శ్రీకొలను సమీపంలోని అడవిలో, ఒక తోటదగ్గర విహరిస్తుంటిన ఈ దానవులను, వారి బంధువులే పసిగట్టి పట్టించారట.

చెంగా లక్ష్మమ్మ అనే ఈ అభాగ్య అవివాహిత యువతిని గతనెల 17 తేది ఆమె ఇంట్లోనే పట్టపగలు ఈ నరకపు చెరిచిన విషయం పాఠకులకు తెలిసిందే. వీరు ఆమెను చెరచడమే కాకుండా యోనిలో దీపం కొట్టారట; పెద్ద కర్రముక్క దూసిపారట. పాపమా స్త్రీ హింసలకు తట్టుకోలేక ఆమె చనిపోయిందట. ఈ కేసును మాఫీచేయడానికి గ్రామ పెద్దలనుంచి పోలీసులవరకు దారుణ ప్రయత్నమే జరిగినట్లుంది కాని, ఉద్రేగతంతో ఫలించినట్టులేదు.

కొరికిన నరరూప దానవులు వీరూ- ఒల్లంపాటి బాలిరెడ్డి, వెంగళరెడ్డి, మూరా కృష్ణారెడ్డి; ఇటువంటివారికి బహిరంగంగా కొరతవిధించే శిక్షలు అమలుచేసే రోజులు ఎప్పుడు వస్తాయో!

## ★ జిల్లా వార్తలు ★

### కోవూరు నీటి కరువుమంట

మొత్తం కోవూరుతాలూకా అంతా నీళ్ళులేక పైర్లు మలమలమాడిపోతుంటే, ఒకానొక తెలుగుదేశం ప్రముఖుడి పదెకరాల పైరు కళకళలాడుతూందని, అధికారులు కష్టపడి దాని పచ్చదనం నిలబెడుతున్నారని పేరు చెప్పడానికి కూడా ధైర్యంలేని ఒక రైతు కడుపుమంట వెళ్ళగక్కుతున్నాడు.

కలిగిరి రిజర్వాయర్‌లో నుంచి వచ్చే పంటకాల్వలోని చారెడు నీరు నిలబెట్టడానికి మొదట అధికారులు తూములు బిగించివేశారట. అయితే సచివోత్తమునికి సన్నిహితుడైన ఈ నాయకుడి పొలానికి నీళ్ళు కావలసి వచ్చినందుకే ఈ స్వర్ణ కాలువలోకి నీళ్ళువదలి, బ్రాంచి కాల్వల ద్వారా 6 మైళ్ళు నడిపించి, పదెకరాలు తడిపారట. పశువులు త్రాగడానికి అడిగినా ఇవ్వని అధికారులు, 10 ఎకరాల కోసం ఇంతదూరం నీళ్ళెట్లా నడిపారంటాడు ఆ పేద రైతు. మాకు మొరపెట్టుకునేకంటే మొన్న మంత్రి రిజర్వాయర్ మీదుగా సిద్దిపురం పోయారే- రోడ్డు నిలదీయకూడదా?

### కావలి యువతి హత్య

కావలి వైకుంఠపురానికి చెందిన అంకులమ్మ (28) అనే యువతిని ఆమె భర్తే హత్య చేశాడట. పెదపవని రోడ్డులోని ఒక చవుకతోటలో కుక్కలు నక్కలు పీక్కుతింటున్న శవాన్ని పోలీసులు గుర్తించి, వెలికితీస్తే ఈ విషయం బయటపడింది.

అంకులమ్మ, తన భర్త మాలకొండయ్యతో కలిసి 10 రోజుల క్రింద ఎక్కడికో వెళ్ళిందట; మళ్ళీ ఇద్దరూ తిరిగి రాలేదు తర్వాత ఈ శవం బయటపడింది. కొండయ్య పరారీలో వున్నాడట హత్యకు కారణం తెలిసినట్టులేదు.

### గూడూరు ఎన్. సి. సి.

గూడూరుటౌన్‌లో 19 తేది ఉదయం ఎన్. సి. సి. విద్యార్థులు శాంతియాత్ర జరిపారు. జి. ప. హైస్కూలు, ప్రభుత్వ కాలేజి క్యాడెట్లిద్దరూ పాల్గొన్నారు. చివర్న మహిళామండలి ఆవరణంలో సభ. ప్రిన్సిపల్ డాక్టర్ బి. రామకృష్ణ అధ్యక్షించారు. సబ్ కలెక్టర్ శ్రీ జె. రేమాండ్ పీటర్, శ్రీమతి లక్ష్మీ మదన మోహన్, శ్రీ డి. కె. శర్మ తదితరులు మాట్లాడారు. శాంతియాత్రకు శ్రీ చిన్న బ్రహ్మయ్య, శ్రీ లక్ష్మయ్య నాయకత్వం వహించారు.

### ముత్తుకూరు ఫిర్యాదు

ముత్తుకూరు సబ్ రిజిష్ట్రార్ ఆఫీసులో డి.ఆర్.డి.ఎ మోటార్లకు సంబంధించిన పత్రాలు అందచేయడంలో సిబ్బంది అవినీతికి పాల్పడుతున్నారని, ఒక తెలుగుదేశం నాయకుడు ఫిర్యాదుచేస్తున్నారు. నిజమేనా?

### గడ్డంవారిపల్లె హత్యకేసు త్రోసివేత

జలదంకి మండలానికి చెందిన గడ్డంవారిపల్లె గ్రామంలో 11 తేది రాత్రి చింతంరెడ్డి రామిరెడ్డి అనే రైతును అతని తోడల్లుడు కాటా ఆదిరెడ్డి కొట్టిచంపాడన్న హత్యకేసును అడిషనల్ జిల్లాజడ్జి శ్రీ ఎన్. సి భాష్యం విచారించి, నేరం రుజువుకాలేదని భావించి, కేసు కొట్టివేశారు. ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా అడిషనల్ పి. పి. శ్రీ పి. బలరామయ్య, ముద్దాయి తరపున శ్రీ పి. విజయకుమార్ రెడ్డి, కుమారి జి. నిర్మల వాదించారు.

### కొత్తూరు లయన్స్ శిబిరం

నెల్లూరు లయన్స్‌క్లబ్ ఇటీవల ఇందుకూరుపేట సమీపంలోని కొత్తూరు గ్రామంలో ఉచిత వైద్యశిబిరం నిర్వహించింది. 67 మంది చర్మరోగులను 178 మంది కంటిరోగులను ఈ శిబిరంలో పరీక్షించి, ఉచితంగా మందులిచ్చారు. డాక్టర్ సి. భాస్కరరావు, డాక్టర్ పి. రఘురామిరెడ్డి శిబిరంలో పాల్గొన్నారు. లయన్స్ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ సర్వేపల్లి మల్లికార్జునశర్మ, శ్రీ రామమోహనరావు శిబిరం నిర్వహించారు.

### సౌత్‌మోపూరు జి. ప. హైస్కూల్

వెలూరు మండలం, సౌత్‌మోపూరు వారి శ్రీ జి. ప. హైస్కూల్ భవనానికి ఇంతవరకు కరెంటు లేదట. శ్రీ ప్రకాశరావు అనే టీచరు తన తండ్రి స్వర్గీయ దారం శేషయ్య స్మృత్యర్థం స్కూలుకు కరెంటు వేయించాడట, స్కూలు తరపున హెడ్మాస్టర్ ఆయన్ను అభినందిస్తున్నారు. ★

---

# పినాకినీ తీరం

(2 వ పేజీ కొరవ)

గాని, శ్రీనివాసులురెడ్డిగారికే ఎందుకివ్వలేదా? అనుమానానికి ఆస్కారం కల్గిస్తున్న అంశం ఇదే!

## బోగస్ సభ్యత్వం-

### అర్జునసింగుకు జాబు

కాంగ్రెస్‌లోని బోగస్ సభ్యత్వాన్ని గూర్చి నెల్లూరు కాంగ్రెస్ 'నాయకుడు' ఒకరు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షుడు శ్రీ అర్జునసింగుకు నాలుగు పేజీలు సుదీర్ఘమైన పుత్తరం వ్రాశారు; దాని కాపీలు అందరికీ పంపిస్తున్నారు. 'పర్సనల్' అన్నారు కాబట్టి ఆయన పేరు పుల్లేఖించడం బాగుండదు; అందులోని విషయాన్నిగూర్చి చర్చించుకోవచ్చు.

ఆ పుత్తరాన్ని నేను ఓపిగ్గా రెండు మూడు సార్లు చదివాను; నవ్వువచ్చింది. నవ్వు ఎందుకంటారా, అందులోని అనేక అంశాలకు! మొదటి అంశం- తన ఈ సలహాలను ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలన్నిటికీ పంపి, వాటిపై వారి అభిప్రాయాలను తెప్పించి, ఈసారి కాంగ్రెస్ వార్షిక మహాసభ నాటికి కాంగ్రెస్ నిబంధనావళిలో మార్పు జరిపించాలనేది ఆ 'నాయకుని' సలహా. అసలు రాలే కాంగ్రెస్‌తో ఈయన అనుబంధమెంత, కాంగ్రెస్‌లో ఈయన సేవ ఎంత, రాజకీయాలలో ఈయన అనుభవం ఎంత.... ఇటువంటి నివేదికలు తయారు చేయడంలో గుమాస్తా గిరికి క్షేమగ్గా వుపయోగపడ గలడనే వుద్దేశ్యంతో ఒక పదవి ఇవ్వబడినంతనే, తనకుతాను పెద్దరికాన్ని ఆపాదించుకొని, ఏదో కొత్తసంగతి అయినట్లు, తాను కొత్తగా పరిశోధించి కనుగొన్నట్లు, తన సలహాను అన్ని ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాలకు సర్క్యులేట్ చేసి, నిబంధనను సవరించమని సలహా ఇవ్వడమా? ఇది చదివితే మీకుమాత్రం నవ్వురాదూ?

నావలెనే ఈయనా నెల్లూరు వదలి బయట కాలుపెట్టినవారుకాదు; కాని తన జాబులో కొన్నిరాష్ట్రాలు, కొన్ని జిల్లాలు అంటూ పేర్కొని, కాంగ్రెస్ సభ్యత్వంలో అరవైశాతం దొంగసభ్యత్వమని నిర్వచిస్తాడు! ఒకరాష్ట్రంలో అట యాభైవేలసభ్యత్వము, పదిలక్షల రూపాయల డబ్బు ఆఖరురోజు డిపాజిట్ చేయబడ్డాయట! ఈ నాయకుడి 'సర్వే'లో వెల్లడైన విషయాలలో ఇదొకటి. ఆయన పరిశోధనలో తేలిన మరో అంశం- రూకబలం, మూకబలం కలిగినవారి హస్తగతమవుతాయట కాంగ్రెస్ సంఘాలు. రూక, మూక పరుసలో ఇంకొకదాన్ని చేర్చడం మరచిపోయినట్టున్నారు ఆయన; కాంగ్రెస్ సభ్యత్వ పుస్తకాలు ఎవరి చేతిలో వుంటాయో వారిచే కాంగ్రెస్ సంఘాలు అనికూడా చెలిబుచ్చివుంటే బాగుండేది! చివరగా ఆయన సలహా ఏమిటంటే 25 మంది ప్రాథమిక సభ్యులను చేర్చినవాడే క్రియాశీలిక సభ్యుడు కావాలనేది! ఇప్పుడు చేర్చుకుంటానే అవుతున్నారా?

దొంగ సభ్యత్వం విషయంలో ఈ మిత్రుని ఆవేదనను, ఆందోళనను అవగాహన చేసికోగలను, కాని ఆయన ఆరాటం దేనికి సంబంధించింది, ఆయన లక్ష్యము ఎవరిని వుద్దేశించి అనేది నాకు అర్థం కావడంలేదు. దొంగ సభ్యత్వం వుండకూడదు; దాన్ని నిరోధించి తీరవలసిందే, కాని కాంగ్రెస్ ఖర్మ ఏమోకాని దాని పుట్టుకతోటే దొంగసభ్యత్వంకూడా పుట్టినట్టుంది; అర్జునసింగుకు జాబు వ్రాసిన మిత్రుడు కాంగ్రెస్‌కు కొత్తవాడు కాబట్టి తెలియదేమోకాని, కాంగ్రెస్‌చరిత్ర వ్రాసి, అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించిన డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వుండగా పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంకు చెందిన ముప్పయ్‌వేల సభ్యత్వాన్ని మటుమాయం చేశారట. ఇది ఏ యాభై ఏళ్ళ ముందునాటి సంగతో! కాంగ్రెస్ ఎన్నికల విషయానికొస్తే నేను విద్యార్థిగా వున్నపుడుఒక్కసారి నెల్లూరు తిప్పరాజువారి సత్రం పాత భవనంలో బ్యాలెట్ బాక్సులుపెట్టి, కాంగ్రెస్ ఓటర్లుపోయి పద్ధతిగా ఓటువేసి ఫలితాలు ప్రకటించబడ్డాయి; అంటే దొంగ సభ్యత్వంగాని, కాంగ్రెస్ సంఘాలకు ఎన్నికలు జరగకుండడంగాని ఈనాడు కొత్తగాదు. అవి చాల పాత విషయాలు; మాన్యులు అలవిగాక వదలివేసిన విషయాలు! అటువంటిది కాంగ్రెస్ సంస్కృతి తెలిసినాతో నిండివున్న కాంగ్రెస్ సంఘాలు పరమ పవిత్రంగా తయారవుతాయని కోవడం దారుణం కాదా?

నేను కాంగ్రెస్ ప్రాథమిక సభ్యుడుగా చేరదలచుకుంటే ఇదిగో అదిగో అన్నారుగాని సకాలంలో పుస్తకం పంపలేదు. తర్వాత ఇంకెవరివద్దనో తీసుకొని చేరానుకోండి. ఎక్కడో ఏందో జరిగిందని వాపోయే ఆ మిత్రుడు దీనికేమంటారు? చెప్పదలచుకున్నది ప్రియంగా చెప్పలేకపోవడం నా బలహీనత. మనసు నొప్పించివుంటే ఆ మిత్రుడు క్షమించాలి!

NSR

# అంజయ్య-నెల్లూరు

(2 వ పేజీ కొరవ)

కాల మిత్రుడైన నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డిగారి మాటనుకూడా త్రోసిరాజని, అపరిచితుడైన జనార్ధనరెడ్డిని రెవిన్యూ మంత్రిగా తీసుకోవడమేకాకుండా, 'సూపర్ ముఖ్యమంత్రి' అనే ఖ్యాతికల్గేంత ప్రాధాన్యత నిచ్చారు శ్రీ చెన్నారెడ్డి అనాడు ప్రధాని ఇందిరాగాంధీవద్ద జనార్ధనరెడ్డికున్న పలుకుబడి తక్కువ కాదని ప్రతీతి. అటువంటి బలవంతుడైన జనార్ధనరెడ్డికి తన మంత్రి వర్గం మొదటిజాబితాలో స్థానం లేకుండాచేసి, రాజకీయవాదులందరూ ముక్కుమీద వ్రేలువేసుకునేట్లు చేశారు చెన్నారెడ్డి తర్వాత ముఖ్యమంత్రి అయిన శ్రీ అంజయ్య! తర్వాత నెలాపదిహేను రోజులకే విస్తరణలో జనార్ధనరెడ్డికి భారీశ్రమ భారీశాఖలోనే మంత్రిత్వమిచ్చారు; తర్వాత 1981 ఫిబ్రవరి 7 తేదీ అనుకుంటాము-రెవిన్యూ శాఖను జనార్ధనరెడ్డికి పునరుద్ధరించారనుకోండి! తర్వాత ఇచ్చినా మొదట జనార్ధన రెడ్డిని దూరంగా వుంచగలిగిన ధైర్యాన్ని అంజయ్య ప్రదర్శించగలిగారు!

జనార్ధనరెడ్డికి మొదట మంత్రిత్వం మొగించడమేకాదు. తర్వాత ఆయన్ను తీసుకునేటప్పుడు ఆయనకు బద్ధ విరోధి అయిన నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారిని కూడా మంత్రిగా తీసుకొని, జనార్ధనరెడ్డి పరుగుకు కళ్ళెం వేయగలిగిన సాహసాన్ని కూడా ప్రదర్శించాడు శ్రీ అంజయ్య. చెన్నారెడ్డిగారుగాని; అంజయ్య తర్వాత ముఖ్యమంత్రులైన భవనం వెంకట్రామ్, విజయభాస్కరరెడ్డి గారలకుగాని అంతగుండె లేకపోయింది. ఆ విద్య అంజయ్యదో, ఢిల్లీ అండతో అంజయ్య ఆ విధంగా చేయగలిగారో మనకు తెలియదు.

జనార్ధనరెడ్డితో బాటు మంత్రిగా తీసుకున్న శ్రీనివాసులురెడ్డిని అంజయ్య ఎక్కువకాలం మంత్రిగా నిలుపుకోలేకపోయారు; శ్రీనివాసులురెడ్డికి 1980 డిసెంబరులో మంత్రిత్వమిచ్చారు. 1981 ఫిబ్రవరిలో తొలగించారు. కాని అంజయ్య ఆయన్ను పుత్త వాట్ట చెయ్యలేదు. ఆర్. టి. సి. ఛైర్మెన్ పదవి ఇచ్చి అప్పుడు కొరతతీర్చడమేకాకుండా: 1981 ఆగస్టులోనే మరలా మంత్రిగా తీసుకోవడమే కాకుండా ఈసారి చక్కెర వంటి తేలికశాఖ బదులు పంచాయితీ రాజ్యంవంటి బరువైన శాఖనిచ్చి, ఆయన చేతులకు బలం కల్గించారు. బలమైన శాఖను భరించగలిగిన శక్తి లేనివారు కాబట్టే శ్రీనివాసులురెడ్డికి పంచాయతీరాజ్ శాఖనిచ్చి, ఆయనకు కొండంత అండగా అంజయ్యగారు నిలిచినా జనార్ధనరెడ్డి ధాటికి నిలువలేక చివరకు తెలుగుదేశం పంచన చేరారు శ్రీనివాసులురెడ్డి!

పార్టీలోవుంటూ ఎప్పుడూ ప్రతిపక్ష నాయకుని పాత్ర నిర్వహిస్తుండిన శ్రీనివాసులురెడ్డికి మంత్రిత్వం ఇవ్వడమే కాదు; మూడునాలుగుసార్లు ఎం.ఎల్.ఎ. అయి, శాసనసభ్యుడుగా సీనియారిటీ పెరగడంతప్ప ఇతర పదవీయోగం ఏమీ లేకుండా నిరాశోపహతులై వుండిన శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డికి ప్రప్రథమంగా పదవీప్రాప్తంకల్గించినవారుకూడా అంజయ్యగారే. ఆయనకు మంత్రిత్వం ఇవ్వలేదుకాని 1980 డిసెంబరులోనే కోస్తా ఆంధ్ర ప్రణాళికాభివృద్ధి బోర్డు ఛైర్మెన్ పదవిని ప్రసాదించి, క్యాబినెట్ హోదా కల్గించారు అంజయ్య.

శ్రీనివాసులురెడ్డికి మంత్రిత్వం ఇచ్చినా, పెళ్ళకూరుకు ప్రణాళికాబోర్డు ఛైర్మెన్ పదవి ప్రసాదించినా, అంజయ్య వారి రాజకీయ నిరుద్యోగాన్ని తొలగించడానికి వారిమీద అభిమానంతో ఇచ్చివుండరు; దానికి వేరే కారణాలుండాలి. వీటన్నిటినీ పేర్కొనడం అంజయ్యగారి చర్యలను ఎన్నడానికికాదు; అవిద్యావంతుడు, అమాయకుడు అని భావించబడిన శ్రీ అంజయ్య ఎంత అసాధ్యుడో, రాజకీయ దురంధరుడో తెలియజెప్పడానికే!

★

## పంచాంగం

### శుక్రమౌఢ్యమి

30-10-86 వ తేది మొదలు 8-11-86 తేదివరకు శుక్రమౌఢ్యమి.

### పండుగలు

1-11-86 వ తేది శనివారం నరక చతుర్దశి, దీపావళి.

### స్వాతికార్తె

6-11-86 తేది గురువారం పగలు 2-17 గంటల వరకు స్వాతి కార్తె వుండును.

### అక్టోబరు తిథులు

25 శని సప్తమి ప 10-50 గం. వ
26 ఆది అష్టమి ప 12-35 ..
27 సోమ నవమి ప. 1-47 ..
28 మంగళ దశమి ప 2-36 ..
29 బుధ ఏకాదశి ప. 3-04 ..
30 గురు ద్వాదశి ప. 3 03 ..
31 శుక్ర త్రయోదశి ప. 2-07 ..

—నిమ్మగడ్డ వెంకటేశ్వరశాస్త్రి

# చిత్రాన్ని ఆదరించేది ప్రేక్షకులేగాని అభిమానసంఘాలుకాదు!

దాసరినారాయణరావు దర్శకత్వంలో కృష్ణంరాజు రూపొందించిన "తాండ్ర పాపారాయుడు" 'ప్రీమియర్ షో' అక్టోబర్ 9 రాత్రి తొమ్మిదిన్నరకు హైదరాబాద్ మహేశ్వరి థియేటర్లో ప్రముఖ వ్యక్తులకోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది. అదేసమయానికి పక్కనే వున్న తారకరామ థియేటర్లో బాలకృష్ణ నటించిన రామకృష్ణ సినీస్టూడియోస్‌వారి

**మా మద్రాసు సినీప్రతినిధి**

'అనసూయమ్మగారి అల్లుడు' చిత్రం శతదినోత్సవం జరుగుతోంది. అక్కడ నుండి బాలకృష్ణ అభిమానులు మహేశ్వరి థియేటర్‌పై రాళ్ళురువ్వి, అద్దాలు పగులగొట్టడమే కాక, దాసరి నారాయణరావును, కృష్ణంరాజును నోటికొచ్చినట్లు దూషిస్తూ, దురుసుగా ప్రవర్తించడం చాలామందికి బాధకలిగించింది. కృష్ణంరాజు సంఘానికి, అభాగ్యులకు ఎన్నోవిధాల సేవ చేస్తున్నా, ఆ పార్టీకి చెందిన వ్యక్తికాదు. ఆయనకు రాజకీయాలపట్ల అనక్తిలేదు. దాసరి నారాయణరావుకూడా అంతే. కాని, ఆయన "ఉదయం" పత్రికలో, మనరాష్ట్రంలో అస్తవ్యస్తంగా వున్న ఏలుబడిగురించి తరచు నిర్మొహమాటమైన విమర్శలు నిర్భయంగా వెలువడుతున్న విషయం పాఠకులకు తెలిసిందే! అది పత్రికాధర్మమని, ప్రజల శ్రేయస్సు కోరే అలాంటి ఘాటైన విమర్శలు ప్రచురితమవుతున్నాయన్న సత్యాన్ని బాలకృష్ణ అభిమానులు గుర్తించలేక ఇటువంటి దౌర్జన్యచర్యలకు పూనుకోవడం అనుచితమంటూ అఖిలభారత దాసరి యువశక్తి అధ్యక్షుడు జి. సూర్యప్రకాశ్‌రెడ్డి, కృష్ణంరాజు అభిమానులు, మోహన్‌బాబు అభిమానులుగర్హించారు. "తెలుగుచిత్రం శతదినోత్సవాలను ఎక్కడో మద్రాసులో జరపడమెందుకు? ఏ హైదరాబాద్‌లోనో, విజయవాడలోనో ఎందుకు జరపకూడదని చాలామంది కోరుతూంటారు. తీరా ఇలా హైదరాబాద్‌లో జరిపితే, ఉన్మాదులకి పెళ్ళయితే జతరులకు హడావిడి అన్నట్టు ఈ అభిమానులు దురభిమానంతో హద్దులు మీరడం వాళ్ళ కుసంస్కారం కాదా? ఇటువంటి దౌర్జన్య చర్యలు పునరావృతమైతే అసలు ఏ శతదినోత్సవానికీ అభిమానులకు ప్రవేశం లేకుండా ముందు జాగ్రత్త వహించవలసి వుంటుంది" అని చలనచిత్రరంగానికి చెందిన ప్రముఖులు కొందరు అటీవల తలపోయడం సబబుగానే వుంది.

బాలకృష్ణ నటించిన "అపూర్వసహోదరులు" చిత్రం కన్నా "తాండ్రపాపారాయుడు" దిగ్విజయంగా ప్రదర్శింపబడుతోంది. ప్రేక్షకులకు ఒక్కోచిత్రం నచ్చుతుంది. మరో చిత్రం నచ్చదు. ఏ చిత్రం ఎందుకు బాగా ఆడుతోందో, ఓ చక్కనిచిత్రం ఎందుకు బాగా ఆడడం లేదో తెలియని రోజులివి. మధ్య అభిమాన సంఘాలవారు అనవసరంగా ఆయాసపడడమెందుకో! "తాండ్ర పాపారాయుడు" చిత్రంకన్నా "అపూర్వసహోదరులు" చిత్రాన్ని బాగా ఆడించడానికి అభిమానసంఘాలవారివల్ల వీలౌతుందా? ఏ సినిమానైనా ఆదరించేది ప్రేక్షకులే గాని, అభిమానసంఘాలవారు కాదు. పిండికొద్దీ రొట్టె అన్నట్లు- చిత్రంలోని విలువలనుబట్టి ఏ చిత్రమైనా ఆడుతుంది. అంతేగాని, అభిమాన సంఘాలవారు ఆయాస పడడంవల్ల ఏమాత్రం ప్రయోజనం లేదని గుర్తించేరోజు అట్టేదూరంలో లేదు.



"కోనసీమ కుర్రోడి" జత కుర్రది భానుప్రియ

# కమలహాసన్‌కు వాణి విడాకులు?

**కమలహాసన్‌కు వాణి విడాకులు**

సాంకేతిక కారణాలంగా కమలహాసన్‌కు దూరమైన అతనిభార్య వాణి ఇంకో రెండు నెలలలో కమలహాసన్ నుంచి విడాకులు పొందబోతోంది. "దాదాపు రెండున్నర ఏళ్ళుగా ఎడబాటు కల్గింది మా ఇద్దరికి. డిసెంబర్‌లోనో, జనవరిలోనో విడాకులు పొందడానికి పరస్పరం నిశ్చయించాం. ఈ విషయమై ముందు ఒత్తిడి నేనే తెచ్చాను. కమల్ సాధ్యారం చేశాడు. ఈ ఆలస్యాన్ని నేనిక భరించలేనని చెప్పవలసి వచ్చింది. ఇంతకాలంగా ఆయనలో పశ్చాత్తాపం ఏర్పడి, నన్ను మళ్ళీ పిలుచుకుంటారని ఆశించాను. కాని, ఆయనలో ఏ పరివర్తన కలగలేదు ఆయనచేసిన ద్రోహాన్ని ఇంతవరకు గుర్తించలేదు. విడాకులు పొందాక బెంగుళూరులో నివసిస్తూ, మిగతా జీవితాన్ని నాట్యప్రదర్శనలివ్వడంలో గడపదలిచాను. ఆయన దయాదాక్షిణ్యాలు నాకవసరం లేదు. నా జీవితంలో ఇంతటి భంగపాటు సంభవిస్తుం

—కొరకు 11వ పేజీలో

# కృష్ణకు మళ్ళీ బాలుగొంతు

అమెరికాలో జంధ్యాల దర్శకత్వంలో తయారయ్యే "చిన్నికృష్ణుడు" చిత్రంలో అసలు బాలకృష్ణ నటించవలసింది. పాటలను బొంబాయిలో ఆర్. డి. బర్మన్ సంగీత దర్శకత్వంలో ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం పాడగా రికార్డుచేసి, సౌండ్ ట్రాక్‌ను అమెరికాకు తీసుకెళ్ళిపోయారు కూడా. కాని ఆఖరి క్షణంలో గొప్ప మార్పు వచ్చింది. సమయానికి వీసా సిద్ధంకానందువల్ల మాస్టర్ బాలకృష్ణ అమెరికా వెళ్ళడానికి వీలుపడలేదు. ఇప్పుడా పాత్రను కృష్ణ పుత్రుడు రమేష్‌కి దక్కింది. సౌండ్ ట్రాక్‌లు అమెరికాలో ఉన్నందువల్ల రమేష్‌మీద బాలసుబ్రహ్మణ్యం పాడిన పాటలే చిత్రీకరించబడ్డాయి. ఇదొక విధంగా కృష్ణ-బాలసుబ్రహ్మణ్యం మధ్య గిట్టనివాళ్ళు సృష్టించిన అడ్డుగోడలను కొంతవరకు పడగొట్టినట్లయింది. తన కుమారునికి తప్పనిసరి పరిస్థితులలో బాలసుబ్రహ్మణ్యం నేపథ్యగానాన్ని అనుమతించిన కృష్ణ ఇక తన విషయంలో కూడా పట్టింపును సడలించనున్నట్లు తమ పరి అభిప్రాయం. అంటేత, కృష్ణకు బాలు మళ్ళీ పాడేరోజు అట్టే దూరంలో లేదని ఆశించవచ్చు అదే జరిగితే పంపిణీదారులు, నిర్మాతలు, దర్శకులు హాయిగా ఊపిరి పీల్చుకుంటారు; కృష్ణతో చిత్రాలు తీసేవారి చిక్కులు తీరుతాయి.

**తలంబ్రాలు సమీక్ష**

(11 వ పేజీలో)

## శ్రీ రేబాల కోదండరామిరెడ్డి చారిటీస్

నార్తుమోపూరు, అల్లూరు మండలం-నెల్లూరుజిల్లా

## టెండరు నోటీసు

శ్రీ రామలింగేశ్వరస్వామి దేవస్థానము మరియు శ్రీ రామాలయము నార్తుమోపూరు, అల్లూరుమండలము-నెల్లూరుజిల్లా ఈక్రింద తెలుపబడినపనులకు అనుభవము కలిగిన రిజిష్టరు శల్పి కాంట్రాక్టర్లనుండి నిర్ణీతఫారములో టెండర్లు సీల్డుకవర్లలో కోరబడుచున్నవి.

| వ. నం | పని పేరు | ఎస్టిమేటు విలువ | టెండరు దరావత్తు | పని కాలం | టెండరుఫారం ఖరీదు |
|---|---|---|---|---|---|
| 1) | శ్రీ రామలింగేశ్వర స్వామి దేవస్థానం ముందుభాగమున మహా మంటపము నిర్మాణము | 148000/- | 3700/- | 8 నెలలు | 50/- |
| 2) | శ్రీ రామాలయము ముందు భాగమున అనివెట్టు మండపం పునర్‌నిర్మాణము | 270000/- | 6750/ | 12 నెలలు | 50/- |

1) టెండరు షెడ్యూల్సు కొరకు 7-11-86 సాయంకాలం 5 గం. లోపు ఖరీదు చెల్లించి దరఖాస్తులు పొందవచ్చును.
2) టెండరు ఫారములను 10-11-86, 11-11-86 తేదులలో ఆఫీసు పనిచేయు వేళలలో దేవస్థానము ఆఫీసు నుండి పొందవచ్చును.
3) టెండరు ఫారములను పూర్తిచేసి 13-11-86 తేది మధ్యాహ్నము 2 గం. లోపల శ్రీ రేబాల కోదండరామిరెడ్డి చారిటీస్, కార్యనిర్వహణాధికారి కార్యాలయమునకు చేర్చవలెను.
4) టెండర్లను హాజరయిన టెండరుదారుల సమక్షమున 13-11-86 తేది సాయంకాలం 3-30 గంటలకు శ్రీ రామలింగేశ్వర స్వామివారి దేవస్థానమునందు కార్యనిర్వహణాధికారిచే తెరువబడును.
5) టెండరు ధరావత్తును దేవస్థానమునందు ముందుగా చెల్లించి రసీదు పొందవలెను లేదా డిమాండు డ్రాప్టును కార్యనిర్వహణాధికారి పేరున అల్లూరు సిండికేటు బ్యాంకు బ్రాంచిమీద తీసుకొని టెండరు ఫారముతో జతపరచవలెను.
6) కాంట్రాక్టర్లు అనుభవం మరియు రిజిష్టరు ప్రూఫ్ లెటర్ టెండరుతో జతపరచవలెను
7) ఎట్టి కారణము చూపకుండా ఏ టెండరునైననూ లేదా అన్ని టెండర్లను కొంతభాగముగాని పూర్తిగా గాని అంగీకరించుటకు గాని తిరస్కరించుటకు గాని కార్యనిర్వహణాధికారిగారికి అధికారము కలదు.
8) మిగిలిన వివరములు పై దేవస్థానమునందు అడిగి తెలుసుకొనవచ్చును.

14-10-86
నార్తుమోపూరు

ఎం. పెంచలయ్య
కార్యనిర్వహణాధికారి

## కడపజిల్లా జడ్జి కోర్టులో

O. P. 358/86

సంగటూరు వెంకటసుబ్బమ్మ W/o. రామకృష్ణారెడ్డి, తోట్లగంగవరపల్లి, కడప తాలూకా -పిటిషనరు

Nil -రెస్పాండెంటు

పిటిషనరు పైనరు ఆస్తియైన క్రింద వివరించిన షెడ్యూలుకు పిటిషన్ దాఖలు చేసినారు. ఎవరికైనా అభ్యంతరము వున్న యెడల 10-11-86 తేదీ తెలుపుకోవలెను. లేనంతట పరోక్షముగా తీర్మానించెదరు.

షెడ్యూలు

కడప డిస్ట్రిక్టు, కడప సబ్ డి॥ తోట్ల గంగవరం గ్రామం పొలంలో సర్వేరు పూర్తి డి నెం. 60 య 7-37 సెంట్లు పూరా సర్వేరు తరి డి నెం. 212 య 2.46 సెంట్లు పైకి 1.52 సెంట్లు గల భూమికి హద్దు: తూర్పు చెరువుకట్ట రస్తా; పడమర కాలువ జాగంరెడ్డి ఈశ్వరయ్య భూమి. దక్షిణం కాలువ, ఉత్తరం చింతకుంట నడిపిసుబ్బయ్య యీలోనైన య 1 52 సెంట్లు భూమి వెరసి య 8.89 సెంట్లు

ఎ. ఎం. మాధవరావు
పిటిషనరు అడ్వకేటు

## ఉత్తరక్రియలు

మా తండ్రి
పోకల వెంకయ్య
14-10-86 తేది మంగళవారం స్వర్గస్థులైనారు
వారి కర్మక్రతువులు
25-10-86 తేది శనివారం కల్యాపురంలో మా స్వగృహమున జరుగును.
వారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ,
శంకరయ్య - సూలమయ్య
కృష్ణయ్య - పెంచలయ్య

## జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |

విడి ప్రతి ఒక్కరూపాయి.



నెల్లూరుజిల్లా బలిజ సేవాసంఘం

## సంతాప సందేశం

ప్రముఖ పాత్రికేయుడు, ప్రెస్ వర్కర్ ఆంధ్రమాత పత్రికద్వారా సంఘీయుల ప్రగతికి చిరకాలంగా ఎనలేని సేవలందించిన శ్రీ ఛాకవరం సుబ్బయ్య గారిమృతికి చింతిస్తూ వారిఆత్మకుశాంతి చేకూరాలని కోరుతూ వారి కుటుంబానికి ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము,

నీలకంఠం మునికుమార్‌నాయుడు
అధ్యక్షులు

## కావలెను

నెల్లూరులోని ఒక ప్రైవేటు ఫరంలో సెక్రటరీగా పని చేయుటకు ఇంగ్లీషులో కరెస్పాండెన్సు చేయగల ఇంటర్ లేక డిగ్రీ పాసై షార్టుహ్యాండ్, టైపు తెలిసిన దురుకైన అభ్యర్థులనుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. అర్హతలనుబట్టి జీతం ఇవ్వబడును. రిటైరైనవారుకూడా అర్హులే మీ పాస్‌పోర్టు ఫోటోతో దరఖాస్తులు క్రింది అడ్రసుకు పంపండి.

బాక్సు నెం. 390
C/o. జమీన్‌రైతు - నెల్లూరు

## మహిళలకు ఉచిత విద్య

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ అనుమతితో కావలి సంధ్యా మహిళామండలి శ్వరలో ప్రారంభింపనున్న ఉచిత 'కండెన్సు కోర్సు'లు కావలి మండలము లోని 16-30 సంవత్సరములు మధ్య వయస్సుగల మహిళలెల్లరు ప్రవేశించుటకర్హులు. 7-9 తరగతుల మధ్య చదువు ఆపివేసిన మహిళలు రెండు సంవత్సరములలో యస్. యస్. సి. పరీక్షకు పంపబడుదురు. నెలనెలబట్టి స్టయిపెండ్ కూడ ఇవ్వబడును. చేరదలచినవారు ఈ 30-10-86 లోగా దరఖాస్తు చెయ్యవచ్చును.

సమాధి ధనలక్ష్మమ్మ
ప్రెసిడెంటు
వెంగళరావునగర్ - కావలి









పాడి పరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్
నెల్లూరు మిల్క్‌షెడ్ :: నెల్లూరు. ఫోన్: 4614

## నోటిఫికేషన్

నెం. 4214/బి/85 — 18-10-86

29-10-86 తేది సా. 4 గం కు జాయింట్ డైరెక్టర్, నెల్లూరు మిల్క్‌షెడ్‌వారి కార్యాలయమందు ఈక్రింద తెలిపిన స్క్రాప్ (Scrap) అమ్ముటకు సీల్డుకొటేషన్లు కోరబడుచున్నవి. కనుక సదరు కొటేషన్లయందు పాల్గొనువారు ధరావత్తుక్రింద రు. 5000/- (ఐదు వేల రూపాయలు) పే ఆర్డరుకాని, డిమాండ్ డ్రాఫ్టుకాని మానేజింగ్ డైరెక్టర్ ఎ. పి. డి. డి. సి. ఎఫ్. లి., నెల్లూరువారి పేరపొంది కొటేషన్‌లతో జతపర్చవలెను.

| వ. నెం. | స్క్రాప్‌ఐటమ్సు పేరు | సుమారుగావున్న స్టాకు |
|---|---|---|
| 1. | పాలిథిన్ పేపరు వేస్టు | 4.5 టన్నులు |
| 2. | ప్లాస్టిక్ టబ్బులు పగిలినవి | 500 kgs. |
| 3. | ప్లాస్టిక్ కార్బాయిలు పగిలినవి | 500 ,, |
| 4. | ప్లాస్టిక్ బాగ్సు | 1000 ,, |
| 5. | ఆటోమొబైల్ స్పేర్సు స్క్రాప్ | 1000 ,, |
| 6. | అల్యూమినియమ్ క్యానులు, మూతలు పగిలినవి | 500 ,, |
| 7. | క్రాఫ్ట్ పేపరు బ్యాగ్‌లు వాడినవి | 500 ,, |
| 8. | డిటో చిరిగినవి | 2000 ,, |
| 9. | కార్డుబోర్డు పెట్టెలు పగిలినవి | 150 ,, |
| 10. | డిటో కోర్సు పగిలినవి | 2000 ,, |
| 11. | హెస్సియన్ లేమినేటెడ్ సంచులు చిరిగినవి | 900 ,, |

గమనిక: 29-10-86 తేదిన 3 గం. లోగా డిమాండ్‌డ్రాఫ్టు/పే ఆర్డరు జతపరిచిన కొటేషన్లు ఆఫీసులో ఇవ్వవలెను అట్లు జతపరచని కొటేషన్లు అంగీకరింపబడవు.

2. టెండరు ఆర్డరు పొందిన 7 రోజులలోగా సదరు స్క్రాప్‌ను తీసుక వెళ్ళవలెను. నిర్ణీత పాట్టుతో కలిపి సొమ్ము ముందుగా జమచేసి స్క్రాపును తీసుకు వెళ్ళవలెను. లేనిచో ఆర్డరు కాన్సిల్ చేయబడును, డిపాజిట్ వాపసు ఇవ్వబడదు.

3. ఇతర నిబంధనలు ఆఫీసు పనిచేయు వేళలలో తెలుసుకొనవచ్చును.

4. పై కొటేషన్లు పొడిగించుటకుగాని, నిలిపివేయుటకుగాని మేనేజ్‌మెంటువారికి పూర్తి హక్కులు గలవు

-యం. ప్రభాకరరావు
జాయింట్ డైరెక్టరు

## నెల్లూరు సంగతులు

(4 వ పేజీ తరువాయి)

దేవి ముఖ్యఅతిథిగా పాల్గొని. లక్ష్మీదేవి పూజ చేశారు. తర్వాత ఆమె మాట్లాడారు. శ్రీమతి కనుంతకమల సర్దెడి కుమారి ఎస్. ఎస్. జ్యోతిని సన్మానించారు. తర్వాత జ్యోతి భరతనాట్య ప్రదర్శన జరిగింది.

### బాలసేవికల శిక్షణా శిబిరం ముగింపు సభ

భారతీయ ఆదిమజాతి సేవకసంఘం ఆధ్వర్యంలో బాలసేవికల శిక్షణాశిబిరం ముగింపుసభ 16 తేది శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య స్మారక భవనంలో జరిగింది. సభకు శ్రీ పొలవర్తి వీరయ్య అధ్యక్షత వహించారు. సంఘం ఉపాధ్యక్షుడు శ్రీ మోపూరు రమణయ్య స్వాగతించారు ఎస్ పి గిరీష్‌కుమార్, శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య చిత్రపటానికి పుష్పమాలనువేసి, అభినందనలు చెప్పారు. సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ చదల జానకిరామారావు ఆదిమజాతి సేవకసంఘం నిర్వహిస్తున్న శిశు పౌష్టికాహార కేంద్రాలను గురించి నివేదిక చదివారు. సంఘ సంయుక్త కార్యదర్శి శ్రీ రామావతులాలూనాయక్, డాక్టర్ రాజమ్మ, ఉపాధ్యక్షులు శ్రీ జాలయ్య, సర్వోదయ కళాశాల లెక్చరర్ కుమారి గిరిజాకుమారి మాట్లాడారు. ఎస్ పి. శ్రీ గిరీష్‌కుమార్ బాలసేవికలకు శిక్షణా సర్టిఫికేట్లు పంచారు శ్రీ తనుమ్ల లేటి వెంకటేశ్వర్లు వందనాలు చెప్పారు.

### కళాభారతి నాట్యప్రదర్శన

కళాభారతి సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో 19 తేది టౌనుహాల్లో కుమారి పత్తివాడ రాధిక నాట్యప్రదర్శన జరిగింది. జిల్లాజడ్జి శ్రీ బి శివసాంబమూర్తి డాక్టర్ నటరాజ రామకృష్ణ, రాధికను కళాభారతి తరపున సన్మానించారు.

## అధికారి అనుభవాలు

(4 వ పేజీ తరువాయి)

మునిసిపల్ పరిపాలనాశాఖగాక దేవాదాయ శాఖగూడా వారి ఆధ్వర్యంలో వుండినది. మాగ్రామములోని శ్రీ అయ్యవారి స్వామివారి దేవాలయము చాలాపురాతనమైనది. ఈ దేవాలయము జనమేజయ మహారాజుచే ప్రతిష్ఠింపబడిందని చెప్పుకొనేవారు. ఇటువంటి ఆలయములో కొంతకాలమునుండి పూజా పునస్కారములు లేవు. ఈవిషయమై మంత్రిగారికి ప్రస్తావించగానే వారు తక్షణమే నిత్య నైవేద్యోద్ధరణకై కావలసిన ఏర్పాట్లు గావించారు. మునిసిపల్‌శాఖలో 1968 వరకు ఉపకార్యదర్శిగా వున్నాను. అప్పుడే, అంతవరకూ మేజర్ పంచాయితీ బోర్డుగా వుంటూవచ్చిన కావలి, మునిసిపాలిటీ అయింది. 1968 సం॥న కొన్ని నెలలు సెలవు తీసికొన్నాను. సెలవు అయినవెంటనే విద్యాశాఖకు మార్చారు. విద్యాశాఖలో ఉపకార్యదర్శిగా వున్నప్పుడు 11-12-1968 నుండి 11-2-1969 వరకు స్టేట్ ఎక్సైజ్ డైరెక్టర్‌గాను, 16-4-1971 నుండి 31-7-1971 వరకు సంయుక్త కార్యదర్శి పదవుల్లోను ఆడిషనల్ చార్జితో వున్నాను. నా పుట్టిన తేది యస్. యస్. యల్. సి. రికార్డులో 21-9-1917 కు బదులు పొరపాటున 2-9-1917 అని వ్రాయడంవల్ల, 55 సంవత్సరాలు పూర్తి కావడంతో, అనగా 2-9-1972 న పదవీవిరమణ చేశాను.

★

'సవేరా' అధినేతలు నిర్మిస్తున్న నూతన చిత్రం ప్రారంభోత్సవ కార్యక్రమంలో నిర్మాతలు: సుధాకర్, కరుణాకర్, 'సవేరా' ఎ. వి. కె. రెడ్డి, దర్శకుడు విశ్వనాథ్.

## పాత చిత్రాలతో పోలికలున్నా కొత్తదనంతో మిసమిసలాడ్తూంది!

# తలంబ్రాలు

తెలుగు సినిమా సాంప్రదాయంలో సర్వసాధారణమైన అసభ్యత, అశ్లీలత, అర్థరహిత్య అపంజరాలకు, అమిత దూరంగా, వాస్తవికతకు అద్దంపట్టే కథా కథనాల్తో, నాటితనపు 'తాటాకు' చప్పుళ్లు లేకుండా, నాణ్యతాయుతమైన చక్కని సందేశంతో రూపొందించబడిన చిత్రం కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎం. ఎస్. రెడ్డి సమర్పించిన 'తలంబ్రాలు' చిన్నతరహా చిత్రమైనా చెప్పిన సత్యం గొప్పది. రెడ్డిగారులాంటి ప్రముఖ నిర్మాతలు తక్కువ వ్యయంతో ఇలాంటితరహా చిత్రాలు నిర్మించి, తెలుగు సినిమాను ఆరోగ్యకరమైన దశకు, దిశకు మళ్ళించడం, ఎంతైనా హర్షణీయం.

**చిత్రసమీక్ష**
**సి. నారాయణరావు**

స్త్రీ శీలంతో హోలీలు జరుపుకునే ఈ మగజనారణ్యంలో అనాటిసీతనుంచి నేటి రాధికవరకు అందరూ ఏదో ఒక రూపంలో మగవాడి ఘాతుకానికి బలియైనవారే! ఆమెను అన్నింటికీ యంత్రంగాను, కోరికతీర్చే సాధనంగాచూసే ఈ మగజాతి నైచ్యానికి ఇంకా ఎందరు బలి కావాలి? వారి వేషాలు,మోసాలు ఇంకా ఎన్నాళ్ళు? సహనం కోల్పోయి మండే గుండెతో అతడి దశదిశలు ఏకంచేయగల దశావతారానుమించిన ఏకాదశావతారం అవుతుంది. అనాడు ఈ మగాళ్ళే మూగవాళ్లై ఆ చైతన్యానికి అడ్డుతొలగుతారు. ఈ అమరసందేశం మేళవించిన చిత్రకథ ఇది.

ఓ అమాయికపు పల్లెటూరి రాధికను మధు ప్రేమించానని పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, కోరికలు తీర్చుకొని, ఇదేమిటని ప్రశ్నించిన ఆమెను పోలీసులకు అప్పగిస్తాడు శరీరంతో వ్యాపారం పెట్టమని భయంకరమైన సలహా పారేస్తాడు, అక్కడి దృశ్యాల చిత్రీకరణ చాలా బలహీనంగాను, పకడ్బందీగాను సాగి ప్రేక్షకుల్ని కలవరపెడ్తాయి. అలాంటి రాధికపై పోలీసులు తప్పుడు కేసులు బనాయించడానికి పూనుకోవడం, ఈ నాడు రాష్ట్రంలో ఒప్పులు, తప్పులుగా జరుగుతున్న పోలీసు దురాగతాలకు సజీవ దర్పణం.

ఆ తర్వాత ప్రసాద్ అండలో నిలదొక్కుకుని గాయనిగా స్థిరపడి, తగిన ప్రతీకారంతో మధును అన్నివిధాల కబళించి నిరుద్యోగిని చేస్తుంది రాధిక తన కంపెనీలో చిరుద్యోగమిచ్చికూడా అతణ్ణి బాధిస్తుంది. ఈ సన్నివేశాల్లో వేగం, వినూత్న ఒరవడి అందర్నీ ఆకట్టుకునేలా మలిచాడు దర్శకుడు.

ఎన్నో సంఘటనల తర్వాత, ఎంతో మందిని వేధించిన తర్వాతకూడా మారని మధు, రాధికను సర్వనాశనం చేయాలని పశ్చాత్తాపం నటించడంతో ఆమె అది నిజమని నమ్మి మధుతో పెళ్ళికి అంగీకరిస్తుంది. ఈ మలుపులోని వైవిధ్యం ప్రేక్షకాకర్షణ పొందింది. అనూహ్యమైన ఈ మలుపు అందరి అంగీకారం పొందుతుంది. పాత్రో మాటలు, అడదాని సెంటిమెంట్ పైనా, మగవాడి టాలెంట్ పైనా వదలిన ఈటెలు సినిమాకు మరింత పట్టునిచ్చాయి, ప్రాణం పోసాయి.

ఇక్కడ మరో మెరుపు సృష్టిస్తాడు దర్శకుడు. మధు, తన నిజస్వరూపం తెలిసిన, ప్రసాద్ చెల్లెల్ని నాశనంచేయబోవడం అది రాధిక కంటబడటం సహనం కోల్పోయిన ఆమె అతణ్ణి కాల్చిచంపడం. ఇదీ సినిమా!

రాధిక విధించిన శిక్ష పెద్దదికావొచ్చు కాని అలాంటి మృగమైన మ(తు)గవాడికి, స్త్రీజాతి వేయవలసిన శిక్ష ఇది. అతడిని బ్రతుకనిస్తే, మరెంతమంది జీవితాలను నాశనం చేస్తాడోననే ఆమె ఆవేదన సహేతుకమైంది! ఇక్కడి ముగింపు తెలుగు సినిమాలకు భిన్నంగా ఏర్పడి, ప్రేక్షకుణ్ణి చలనరహితుడిగా మారుస్తుంది. పశ్చాత్తాపుడైన మధు లాంటి పాత్రలు చూపించడం మన సినిమాల్లో సహజమే కాని, నిజజీవితంలో ఎంతమంది దుర్మార్గులు కనువిప్పు కల్గి మంచివాళ్లుగామారుతున్నారనేది ప్రశ్నగానే మిగిలిపోయే ప్రశ్న. అందుకే ఇతివృత్తం సహజత్వాన్ని సజీవంగా చూపించిందనడం అతిశయోక్తి కాదు.

అయితే సినిమా ముగింపు ఎంత ఆకట్టుకుందో ఎత్తుగడ అంత పేలవంగా వుంది. పల్లెటూరి అమ్మాయి నగరానికి వచ్చి 'మాత్రిక' లాంటి ఇంగ్లీషుపదాల్తో, ధారాళంగా తెలుగు మాట్లాడడం, ఎంత వరకూ సమంజసంగా వుంటుంది? పదిహేనవతేదీ అదివారమని చెప్పించి క్యాలెండరులో మాత్రం 'Friday' గా చూపడం. రెండు మూడు రూపాయల విలువ చేసే బెల్టు గుణం కోల్పోయి ఉన్న రాధిక, చెక్కురూపంలో రాత నగదురూపంలో ఇవ్వబోవడం, ఓ ప్రసాద్‌లాంటి తెలివైన వ్యక్తి దాన్ని అంటే నగదు రూపంలో ఇవ్వడాన్ని అంగీకరించడం లాంటివి, చిన్నచిన్న తప్పులే కావచ్చు కాని ఇలాంటి కథాచిత్రాల్లో దొర్లకూడనివి విజ్ఞులైన ప్రేక్షకుల దృష్టి నుండి తప్పిపోనివి!

రాధిక గాయనిగా ఎంత ప్రసిద్ధురాలైనా రాష్ట్రపతి, ప్రధానుల కార్యక్రమాల్లో పాడటానికి పిలుపు రావడం అవాస్తవికతకు పరాకాష్ట. ఇది దర్శకుని తప్పిదంగా పేర్కొనవచ్చు. ఇలాంటి తప్పులు మినహాయిస్తే, కథ 'కుంకుమ తిలకం' లాంటి కొన్ని చిత్రాలతో కొంత పోలికవున్నా, సన్నివేశాల్ని నడపడంలో, పలాకసన్నివేశాలలో క్రొత్తదనంతో తన సమర్థతను చాటుకున్నారు దర్శకుడు.

నటనాపరంగా విలన్ పాత్రలో రాజశేఖర్, మధుగా నటించి మెప్పించారు. జీవిత, రాధికగా తన పాత్రలో జీవించలేకపోయిందిగాని ఫర్వాలేదనిపించింది. నందమూరి కళ్యాణచక్రవర్తి సుశ్రేంగా, చక్కగా నటించాడు తన ప్రసాద్ పాత్రలో!

"తల్లిపాలు, తలంబ్రాలు" లాంటి గొప్ప ప్రయోగాల్తో ఓల్గమాల, రాజశ్రీలు అందించిన సాహిత్యం చిత్రానికి మరింత విలువను తెచ్చిపెట్టిందనిపించింది.

ఓ కవిగారు సెలవిచ్చినట్లు నిన్నటి వరకు రూపాయలు వెదజల్లి పైసలు ఏరుకొన్న ఎమ్మెస్‌రెడ్డికి, నోట్లకట్టలు పేర్చుకునే తరుణం ఆసన్నమైంది 'తలంబ్రాలు' సినిమాతో!

### సినిమా

(9వ పేజీ తరువాయి)

దని నేను కలలోకూడా అనుకొని ఉండలేదు. నేను మాతృమూర్తి అయివుంటే, పరిస్థితి మరోవిధంగా ఉండేదేమో! ఇప్పుడిప్పుడే మనకు సంతానం ఎందుకు? అంటూ నిరోధిస్తూ వచ్చారాయన. సాకిక మూలంగా తండ్రి అయ్యారు. నేను మళ్ళీ పెళ్ళిచేసుకుంటానో-లేదో, ఆ విషయం గురించి ఆలోచించనేలేదు. అయితే, కమల్ ఎక్కడున్నా, నాకెంత ద్రోహం చేసినా-ఒకప్పుడు కట్టుకున్న పాపానికి సదా ఆయన శ్రేయస్సునే కోరడం భరత నారిగా నా ధర్మం," అంది వాణి ఇటీవల. ఈ విషయమై కమలహాసన్ మాత్రం ఏ ప్రకటనా చెయ్యలేదుగాని, సారిక తనకు ద్వితీయ కళత్రంగా లభించడం తన పూర్వజన్మసుకృతమని పలువురితో చెప్పుకుంటున్నారు.

### నిర్మాతలకు భానుప్రియ సలహా

భానుప్రియ మూడు హిందీ చిత్రాలలో బుక్ అవడంతో తెలుగుచిత్ర నిర్మాతలవంక చిన్నచూపు చూస్తోంది. కొన్ని తెలుగుచిత్రాల కాల్‌షీట్లను హిందీచిత్రాలకు సర్దేసిందట ఎవరైనా తెలుగు నిర్మాతలు ఈమెను బుక్ చేయడానికి వస్తే, తన [illegible] రేఖను బుక్‌చేసుకోమని సలహా [illegible]దట. అలాగే కొందరు నిర్మాతలు [illegible] చెల్లెల్ని బుక్‌చేసుకుంటున్నారు. రేపు [illegible] కూడా ఒకటి రెండు హిందీ చిత్రా[illegible]స్తే, మరెవరిని సిఫారసు చేస్తారో! చిత్రాల నిర్మాణం జోరుగా ఉన్నంతవరకు తారల డామినేషన్ తప్పదు మరి.

★

**జాతకములు- ముహూర్తములు**

జాతకములు వ్రాయుట, చెప్పుట, వివాహ ముహూర్తములు, శంకుస్థాపన గృహప్రవేశము ముహూర్తములు పెట్టబడును.

**మత్స్య యంత్రములు**

వాస్తు పరిశీలించబడును వాస్తుదోషం గలఇండ్లకు, కట్టి 30 సం॥ల పైగా అయిన ఇండ్లకు మత్స్య యంత్రములు వేయించుకొనిన దోష నివృత్తి అగును. వివరములకు:
సపతి (శిల్పి - సిద్ధాంతి)
శ్రీ భవాని I.T.I. కాంపౌండులో
రంగనాయకులపేట-నెల్లూరు.

IN THE CITY CIVIL COURT AT MADRAS
O. S. No. 3039 of 1986
(Summary Suit)

JEEVRAJ, Sole Prop. of M/s. Raman Metals -Plaintiff

M/s. Radha Departmental Stores, No.9. Janatha Market, Guda, Shop No. 13., Seethammadhara, Visakhapatnam-13 (A. P.) -Defendant

The Plaintiff has filed the above Suit against you under order 37 Rule 1 & 2 C. P. C, for the recovery of a sum of Rs. 4400/- together with further interest and costs due by you in respect of the goods sold and delivered to you. The said suit is posted before the V Asst. Judge, City Civil Court at Madras on 21-11-1986. The Plaintiff has also applied for attachment before Judgement in I. A. No. 9024/1986 of your properties. If you wish to defend the suit, please file Memo of appearance under notice to the undersigned within 10 days of this publication.

-HIMMATMAL MARDIA
Advocate for Plaintiff
149, N.S.C. Bose Road
Madras-600 079.

**ప్రకటన**

నెల్లూరుజిల్లా అనంతసాగరం మండలంలో చేరిన చిలకలమర్రి గ్రామ కాపురస్థుడు, మునగా వెంకటసుబ్బయ్యకుమారుడు మునగా సుబ్బరాయుడు అయిన నేను తెలియజేయడం ఏమనగా, నా కుమారుడు వెంకటేశ్వర్లు ప్రస్తుతం నెల్లూరు కాపురస్తుడు సరియైన నడవడిక లేక దుర్వ్యసనములకు లోనై అప్పులు చేస్తున్నట్లు నాకు తెలియుచున్నది నాకు వుండబడిన యావత్తు స్థిర చరాస్తులు నా స్వార్జితములు కాన అతనికి నా ఆస్తియందు ఎలాటి హక్కులేదు కాన ఎవరైన వెంకటేశ్వర్లుకు అప్పులు ఇవ్వవద్దు ఇచ్చినను నా ఆస్తిని బద్ధగించదు అని తెలుపడమైనది.

-మునగా సుబ్బరాయుడు

**జమీన్ రైతు చందా**

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |
| విడిప్రతి | ఒక రూపాయి |



**ఇల్లు అమ్మబడును**

నెల్లూరు, బాలాజీనగర్, భూగర్భజల శాఖ ఆఫీసు వీధిలో 27 అంకణముల స్థలం. క్రింద, పై భాగములు కలిపి (10+10) 20 అంకణాల కట్టుబడితో అన్ని వసతులు కలిగిన డోర్ నంబరు 22/101 ఇల్లుఅమ్మబడును. వివరాలకు
వై. వి. సుబ్రహ్మణ్యం
C/o. వి. నాగేశ్వరరావు
22/106బాలాజీ నగర్ - నెల్లూరు

In the Court of the District Judge, Cuddapah
O. P. No. 308/86
T.Prameeladevi-Petitioner
Nil -Respondent

కడప జిల్లాకోర్టు యందు పై ఓ. పి. నెంబరులో పిటీషనరు యొక్క కుమారులు టి మధుసూదనరెడ్డి మరియు టి సంతోష్ కుమార్‌రెడ్డి, మైనర్లు అయినందున వారితరపున గార్డియన్ అయిన వారితల్లి ప్రమీలాదేవి పిటీషను వేసుకున్నది. అందుకు మైనర్లు అయిన కుమారుల పేరుతోనున్న సర్వేనెం తర ఎస్. నం 840/బి1 లో 0-70 సెంట్లు మరియు ఎస్ నం 841/బి1లో 0 62 సెంట్లు పైకి 0-66 సెంట్లు గల భూమిని అమ్ముటకు కోర్టు పర్మిషను కొరకు పిటీషను వేసుకొన్నది.

కనుక ఈ సర్వే నెంబర్లుగల భూమి పై ఎవరికైనను ఏలుపంటి ఆక్షేపణలున్నయెడల 31-10-1986 తేదిన ఉదయం 10½ గంటలకు కడప జిల్లా కోర్టునందు హాజరయి కోర్టువారికి చెప్పుకొనవలయును

-పి. శేఖర్‌రెడ్డి, అడ్వొకేటు

## బొమ్మరిళ్లు

(4వ పేజీ తరువాయి)

లెక్కలు చూపెడుతూని, రు 4500 లు ఇళ్లలో ఆ పక్కాలు ఉపకరి, కట్టడం తను చేత కాదని చేతులెత్తేగారు.

83-84 సంవత్సరానికి ఇళ్ళు అందరూ 6 వేలకి పెరిగింది; అవిదాని అనుచేఒ ఇళ్ళు కట్టాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. అయితే సంవత్సరం ఆఖరకు అందులో సగంకూడా కట్టలేకపోయారు. అప్పటి కలెక్టర్ కుమారి కె. సుజాతా రావు అధికారులపై ఎంతగా ఒత్తిడి తెచ్చినా ఫలితం లేకపోయింది. ఈ లక్ష్యం నెరవేరకముందే 84-85 ఇళ్ళ కేటాయింపులు వచ్చేశాయి.

అయితే ఇళ్ళు ఏఏ సమితులకు ఎన్నెన్ని కేటాయించాలి! ఏఏ గ్రామాలకు ఇవ్వాలి అన్న విధాన నిర్ణయం చేయడంలో కలెక్టర్ స్థాయిలోనే జరిగిన తీవ్ర జాప్యం, లబ్ధిదారుల పేదవాడినుంచి వాటా మొత్తం వసూలు, ఇంటికి కావలసిన సిమెంట్, ఇనుము, తదితర వస్తు సామాగ్రి సరఫరాలో అధికారుల అలసత్వంవల్ల ఇళ్ళ నిర్మాణం నత్తనడక నడిచింది.

ఈ దశలో కొత్త కలెక్టర్ శ్రీ జన్నత్ హుస్సేన్ బాధ్యత తీసుకున్నారు. ఆయన వచ్చిరాగానే ఇళ్ళ నిర్మాణానికి అధికారులకు లక్ష్యాలు నిర్దేశించారు; ఫలాని తేదీ లోపల ఫలాని కాలనీలు పూర్తి అయి తీరాలని ఆదేశించడం, వారికి స్వేచ్ఛ నివ్వడంతో ఈ కార్యక్రమం ఊపునందుకున్నది. ఆ ఊపు ఎంతటిదంటే, 83-84, 84-85, 85-86 మూడుసంవత్సరాల ఇళ్ళు ఈ ఒకటిన్నర ఏడాదిలోనే ముగింపు దశకు వచ్చాయి.

అధికారుల లెక్కప్రకారం 83-84 లో 278 లక్షలతో 4635 ఇళ్ళు, 84-85 లో 266.30 లక్షలతో 4439 ఇళ్ళు, 85-86 లో 243.05 లక్షలతో 4227 ఇళ్ళు పూర్తి చేశారట. ఇవికాక, కట్టిన గృహాల పథకం క్రింద ఈ మూడేళ్ళలో 1492 ఇళ్ళు కట్టారు. ఇవన్నీ 6 వేల రూపాయలవే; కేంద్ర సహాయం క్రింద కడితే పూర్తిగా ఉచితం; రాష్ట్రమైతే ఇందులో 3 వేలు అప్పుట.

ఇవికాక, 1986-87 సంవత్సరానికి మరొక 5 వేల ఇళ్లు కట్టాలని తలపెడుతున్నారు. వీటి అంచనా మొత్తం 8వేలు; రాష్ట్ర ప్రభుత్వ పథకమైతే ఇందులో 4 వేలు అప్పు.

ఇవికాక, తుఫాను పీడిత ప్రాంతాల్లో గృహ నిర్మాణం అని కేంద్ర ప్రభుత్వం ఇంకొక కార్యక్రమం చేపట్టింది. దీని క్రింద ఒక్కొక్కటి 7 వేల ఖర్చుతో ఇప్పటివరకు జిల్లాలో 4100 ఇళ్ళు నిర్మించారు; మరొక 5900 కట్టవలసి వుంది.

గృహనిర్మాణం ఇంత శరవేగంగా జరిగిందికాబట్టే రాష్ట్రప్రభుత్వం నెల్లూరు జిల్లాను ఫస్ట్‌ప్రైజ్ ఇచ్చింది 25 వేల రూపాయల నగదుతోపాటు, పెద్ద షీల్డును కూడా నవంబరు 1వ తేది హైదరాబాదులో కలెక్టర్‌కు అందజేస్తారు. గత సంవత్సరం వరకు ఈ కార్యక్రమంలో మన జిల్లా 15-20 స్థానాలమధ్య వుండేదట. ఒక్క ఏడాదిలో కప్పగంతు వేసి మొదటి సీటు సంపాదించింది; ఆ గౌరవం కలెక్టర్ శ్రీ జన్నత్‌హుస్సేన్‌దే!

లెక్కల్లో, అంకెల్లో ఇళ్ళ సంఖ్య చూస్తే దండిగా వున్నట్లున్నాయి కాని, వాస్తవంలో ఆ ఇళ్ళు శాశ్వతంగా పేదల్ని వినా కష్టపడటంలేదని చెప్పక తప్పదు. ఇప్పటికి కట్టినవాటిలో సగభాగం పైగా వానకు ఉరుస్తున్నాయి; కొన్నిటికి అప్పుడే గోడలు పగుల్చుతున్నాయి కొన్నిటికి అసలు తలుపులు, కిటికీలు లేవు; పెట్టుకోవడానికి ఆ పేదవాని దగ్గర డబ్బు లేదు.

పేదవారికి శాశ్వతంగా నీడ కల్పించవలసిన ఈ ఇళ్ళు బొమ్మరిళ్ళుగా మారడానికి కారణం, నిస్సందేహంగా అధికారుల అలసత్వమే. నిర్లక్ష్యమే! ఇళ్ళ నిర్మాణం చాలావరకు ఎవరిఇళ్లు వారికే అప్పజెప్పారు అయితే, కనీసం క్లాస్ ఫోర్ సెకండ్ క్లాసు ఇంజనీర్లు, వర్క్ఇన్స్పెక్టర్లు అటు ముఖం చూపలేదు కట్టుబడిలో క్వాలిటీ పర్యవేక్షణ లేదు.

కొన్ని ఇళ్ళు అధికారులే కట్టించారు, ఏ ముఖ్యమంత్రో, గవర్నరో వస్తున్నారని, రాత్రి పగలు లైట్లు వేసుకుని గంటల్లో ఇళ్ళు కట్టడం పూర్తయిందనిపించారు. అటువంటి ఇళ్ళన్నీ ఇప్పుడు పూరిగుడిసెల కంటే హీనంగా వున్నాయి. అధికారులలో, తమ లక్ష్యాలు నెరవేర్చాలన్న సంకల్పంతప్ప, పేదవాని పరిస్థితుల పట్ల ఏమాత్రం జాలి, అవగాహన లేనందువల్లనే ఈ దుస్థితి. ★







Edited, Printed & Published by N. Sree Ramamurthy at the Zamin Ryot Press, 170, Thipparajuvari Street, Nellore (A. P.)